ఓమ్

నిగమార్థ చంద్రోదయ గ్రంథమాల

4-వ కిరణము

# సుప్రకాశ శతకము

బళ్ళారి

హైకోర్టు వకీలు

యస్. ఆంజనేయులు, బి. ఏ., బి. యల్.,

గారి ద్రవ్యసహాయముచే ముద్రింప బడినది.

---

ధర్మవరము

రాప్తాటి సుబ్బదాసు

సంపాదకీయుడు.

1925.

---

రు 0—4—0

పినాకినీ ప్రెస్, అనంతపురము.

# విజ్ఞప్తి

మహాశయులారా!

ఆంధ్రభాషాభ్యసనకాలమునుండియు నాకు తద్భాషా రచనాభిలాష యుండుటచేత నా 12-13 వ యేటనే నాటక సమాజముల కాంధ్రనాటకములఁ గొన్నింటిని రచించి యొసఁగితిని. కాని తన్నాటకసమాజములు, గ్రంథకర్తలు నాటక ప్రదర్శనమున ముఖ్యపాత్రల ధరించి యభినయించిన సమాజమునకు గ్రంథప్రాశస్త్యమునకును వన్నెగలుగునని నన్ను నిర్బంధించుటచే వారియభిమత మప్పటిలోఁ దీర్చవలసిన వాడనైతిని, నా యిరువది వత్సరములఁ బ్రాయమున స్వగ్రామమునను కాపు కడవ మండల మండలిమధ్య శ్రీ శారదా మనోవినోదినీ, నాటకసమాజమును శ్రీ మురళి చెన్నారెడ్డిగారి ప్రోత్సాహమున స్థాపించి వారి వేడికోలు ననుసరించి అభినవ చిత్రాంగి, విలాసము! సత్యహరిశ్చంద్ర, పాండవాజ్ఞాతవాసము, శాకుంతలము, స్త్రీసాహసము, ఏకాదశీమాహాత్మ్యము, ధ్రువచరిత్రము, జయదేవచరిత్రము నను నాటకముల రచించి యందలి ముఖ్యపాత్రలధరించి ప్రదర్శనమొనరించుటయే గాక, తత్సమాజమున కధ్యక్షుఁడుగాఁ గొంతకాలముండుటవలనను నాచే రచింపఁబడిన నాటకముల నచ్చొత్తించిన యితరులా నాటకములను బ్రదర్శించిన తమరాబడి క్షీణించునని పై సమాజమువారు చింతించినందునను యానాటకముల నచ్చొత్తించి ఆంధ్రలోకమున కర్పింపఁ జాలక పోతిని.

నాటకాభినయములందుఁ గ్రమముగా నాకుగల యభిరుచి క్షీణించి ఇహపరములకు సాధనభూతమగు హరికథా కాలక్షేపమునకు మనసు వశమగుటచే తత్సాధనాభిలాషతకవిత్వము, నించుక జారవిడచితిని. కాని 1922 సంవత్సరము మే నెల 2 తేదీన నా ద్వితీయ భార్య రోగగ్రస్తురాలై ఈశ్వరప్రార్థన కనువగు మంగళశైలి నొకశతకము రచించి యిమ్మని ప్రార్థింప. వల్లెయని నామె యభీష్ట మీడేర్ప పరమేశ్వర శతకమును రచియించుచుండ తన్మధ్యమునందే యామె తనయసులబాసి దివికి చనెను. ప్రారంభించిన కార్యమును మధ్యలో విడచుట ధర్మముగాదని వెంటనే శతకమును పూర్తించితిని. అప్పటినుం

డిరయు మరల కవనమున నాకు మిక్కిలి పట్టుదలగలుగుటచే, మరల సుప్రకాశ్యమను మకుటముతో నీ శతకమును రచించితిని.

ఆంధ్రభాషామతల్లి యనుత్తమమును యమూల్య మాల్యాలంకారముచే విలసిల్లు నీ కాలమున నల్పజ్ఞుఁడనగు నేనీ శాస్త్రమును రచించుట సిగ్గులచేష్టయైనను నా మాతృదేవతయు నను గారాబముగ బెంచిన సోదరీమణియు, ప్రియురాలగు అర్ధాంగినియు వెంట వెంటనే గతించుటయు ఆ దుఃఖానల మొక్కుమ్మడి నన్నలమికొనుటయు, తన్నివారణార్థము అస్థిరమగు నీ ప్రపంచ సుఖముల నాశింపక శశవిషాణముమంటి బాంధవ్యముల నమ్మక, ఈశ్వరారాధనకు గడంగుమీ" యని ఆత్మ బోధయగుటయు నీ శతక రచనమునకు గట్టి పట్టుదల సమకూరెను.

ఏమి కాల మహిమమో ప్రపంచమున దినదినమును నూతనరోగములుద్భవించి ప్రజల ననేక విధముల కష్టపెట్టుచుండుటచేత ఏయింతటి చికిత్సకైనను రాజయక్ష్మ భగంధర హృద్రోగాదులు నయము కుండుటచేతను అథవా యించుక నయమైనట్లు గన్పట్టినను అవి ధనికులకు సాధ్యమగుటచేత, అగతికులకును దీనులకును నిన్నిరోగములు సులభముగా బోవుమార్గమును యోచించి నది ప్రకృతి చికిత్సయే యమృత తుల్యమని గొప్పవైద్య శిఖామణులు నిర్ణయించిన మేరకును నాయనుభవమును బట్టియు సత్యమని నిశ్చయించి ప్రకృతి చికిత్సాశాలను శ్రీహరియోగాశ్రమమున నెలకొల్పి నా చికిత్సకు వలయు నుపకరణముల సేకరించుటకు నా కీశ్వరుఁడొసఁగిన హరికథా రూపకళాశక్తి కొంతవరకు వినియోగించుచుండుటవలన నీ శతకము నింతవరకు ముద్రింపింపఁజాలకపోతిని.

కొంతకాలము వణిక్కుఁడుగా నుండుటచే తత్సంబంధము నొక వ్యాజ్యము బళ్ళారికోర్టున నాపై నొక వ్యాపారి తెచ్చెను. ఆ యభియోగ విచారణ దివసమునకు ముందుగానే నీ శతకమును వెంటఁగొని బళ్ళారికి వెళ్ళి హైకోర్టు వకీలును సువ్యాదులును దేశహితైక కార్యాచరంధరులును, స్వమత సంస్కరణాయత్తచిత్తులును, నాకత్యంత మి

మిత్రులగు శ్రీయుత శృంగిణి కొండల ఆంజనేయులు బి. ఏ., బి. యల్. గారి గృహమున బసచేసి యొకనాడు ప్రసంగవశమున నీ గ్రంథమును గూర్చి సూచింప, వారును వారిధర్మపత్నియు సాధ్వీశిరోరత్నమగు శ్రీమతి రంగనాయకమ్మ గారును శతకమునందలి కొన్ని పద్యముల చదివింపించి విని యానందించి సంతోషమున నీ శతక ముద్రణా వ్యయమును తాము భరించుటకు సమ్మతించుటయే గాక నాపై గాబడిన యభిరాగమును మాటమాత్రమున తేలఁగొట్టిరి. యట్టి యుదారదంపతులకా సుప్రకాశుఁడే చిరతరాయురారోగ్యములఁ బ్రసాదించుగాక!

ఈ గ్రంథమునఁగల వ్యాకరణదోషముల సవరింపఁగోరగా ప్రస్తుతము కల్యాణదుర్గము, బోర్డుమాధ్యమిక పాఠశాలాంధ్ర పండితులుగానుండు బ్రహ్మశ్రీ నాగసముద్రము టి. రంగాచార్యులుగారును నాకత్యంత ప్రియస్నేహితుఁడును గుత్తి కోడూరు క్రైస్తవ పాఠశాలాంధ్ర పండితుఁడునగు, బ్రహ్మశ్రీ కృష్ణశర్మ గారును తమకుఁగల యవసర కార్యములటుంచి గ్రంథమును సవరించి ముద్రణమునకు నన్ను ద్వరపెట్టిరి. వీరలు నాకు తోడ్పడి నన్ను ప్రోత్సహించి నందులకు మిక్కిలి కృతజ్ఞతను దెలుపుచున్నాను.

మతవివక్షతలేనందులకును సర్వులఁ బఠించుట కనువగు నటులను యోచించి "సుప్రకాశా" యను మకుటమిడితిని. నీ శతకము కేవల పండితాదరణమునకు పాత్రిత గాకున్నను పామరులును, అక్షర జ్ఞాన విహీనులగువారి యుపయోగమునకైన మార్గదర్శి యగునని దలచి నీ గ్రంథము రచించితిని. ఇందలి తప్పులున్న దెలియజేసిన విజ్ఞులకు వందన శతము లర్పించి ముందు ముద్రణమున సరిదిద్దుకొందునని సహృదయులను కేలుమోడ్చి ప్రార్థించుచున్నాడను.

ఇట్లు,
రాప్తాటి సుబ్బదాసు.
దేశదాసుడు.

| తప్పు | | ఒప్పు | |
|---|---|---|---|
| పేరాసంఖ్య | | పద్యసంఖ్య | |
| 5 | భూతబులు | 8 | భూతంబుల |
| 6 | తేరన | 9 | తేరను |
| 6 | కిరచరణంబులు | 10 | కర చరణంబులు |
| 7 | సట్టిపడెడు | 11 | నుట్టిపడెడు |
| 7 | పడ్రిహోపేత | 11 | షడ్రిహోపేత |
| 7 | సుధన్వాకు | 12 | సుధన్వుడు |
| 8 | యౌవన | 14 | యౌవ్వన |
| 9 | విలసు | 15 | నలసు |
| 10 | తామసిచి | 16 | తామసించి |
| 10 | యొగున | 17 | యొగుచు |
| 10 | పేనంబెవ్డు | 18 | ఫేనంబెవ్డు |
| 15 | గరగసంబు | 27 | కరగసంబు |
| 20 | స్వర్ణకారకవస్త్రి | 35 | స్వర్ణకారాది |
| 20 | జనుల | 35 | ఖనుల |
| 22 | చంచల | 38 | చంచలి |
| 24 | బలశిశుపాలుడె | 42 | ఖలశిశుపాలుడె |
| 24 | దివ్యచంద | 42 | దివ్యచరిత |
| 26 | నిరగుపొరగు | 45 | నిఱుగుపొఱుగు |
| 34 | నేతిద్వయంబుగా | 60 | నేత్రద్వయంబుగా |
| 38 | నిర్విచార | 67 | నిర్వికార |
| 39 | మత్యంబు | 68 | ముత్యంబు |

| | |
|---|---|
| 39 అఖల | 68 అఖిల |
| 39 నీరధిముదళి | 69 నీరధి ముందళి |
| 39 నూట | 70 నూనుట |
| 41 నశంబు | 72 నసిశంబు |
| 42 నన్నక | 74 నన్నిక |
| 42 బిలివు | 74 భిల్వింవు |
| 42 లనభవించియు | 75 లనుభవించియు |
| 44 నీరేజబు | 78 నీరేజంబు |
| 50 పరణియాండ్రు | 89 సరణియండ్రు |
| 50 మనంబును బుద్ధి | 89 మనంబున బుద్ధి |
| 52 విశ్వాసములు | 92 సిశ్వాసములు |
| 54 గూపకుండి నన్న | 96 గూడకుండడి నిన్న |
| 55 యొప్పడిందమవసి | 98 యొప్పడింవు నావసి |
| 59 శరశిమ | 105 శరదిందు |
| 59 కన్నతిగిపట్లు | 105 కన్నతిగిన్నట్లు |

# పండితాభిప్రాయములు

---

శ్రీ రామ.

"సుప్రకాశ శతకమును". నీశతకము మన్మిత్రులగు శ్రీ సుబ్బదాస కవిచే రచియింపఁ బడినది. శైలి ధాటి చక్కఁగా నున్నదని గ్రంథమును బఠించువారే యెఱుఁగఁ గలరు. ఈ కాలమునఁ గుక్క గొడుగులవలెఁ బుట్టు వేలకొలఁది పుస్తకములను జదువు నరుచి దీనిఁ జదివి తొలఁగించుకోవచ్చును.

ఇది గజేంద్ర మోక్షమువలె నిరాకారుఁడని చెప్పఁబడు భగవంతు నుద్దేశించి చెప్పఁబడినది. దీని వలననే కాక యితర వర్ణనములఁ బట్టి చూచినను జన్మముచేఁ గర్మముచే విశిష్టాద్వైతి యైనను భావమున నద్వైతి యని స్పష్టపడు కొన్ని విషయములు చాల రమ్యముగ జెప్పఁబడినవి. కొన్ని పద్యములు నీకవిగారి సహజ సౌజన్యము, నమ్రత, భక్తి, పరోపకార బుద్ధి వ్యక్తీకరించుచున్నవి. ఈ గ్రంథమునే కాక యీయన మఱియుఁ గొన్ని హరికథలు నాటకములు లోనగు గ్రంథముల రచియించి యున్నారు. అవియును ద్వరలో వెలువడి యాంధ్రభాష నలంకరించును గాక.

29—11—24 వాసుదాసుఁడు.
ధర్మవరము "ఆంధ్రవాల్మీకి"

శ్రీ సుప్రకాశమను నీ శతకమును తత్కర్తయగు సుబ్బదాసుగారి దయచే జూడ గలిగితిని. అసమాన ములగు నీతుల నతి సులభశైలి నెల్లరకును వ్యక్తమగురీతి పౌరాణిక ప్రమాణ్యముల నిరూపించుచు నీ గ్రంధము వింగుల శోభిల్లుచున్నది. పరిశుద్ధాస్తిక మతమును బోధించుటయే ప్రాముఖ్యముగా గలిగి దైవ మానవుల చూపుల కందని సూత్రములను కడుంగడు నేర్పున సులభ మార్గమున దెలుపుచున్నది.

గ్రంధకర్తలగు సుబ్బదాసు గారిచేతిలో నాంధ్ర భాష సాముర్యరీతుల విలసిల్లి చదివినంతనే చవులొల్కునా కృతుల మూర్తీభవింప చేయుచున్నదని చెప్పుట నతిశ యోక్తి కానేరదు.

ఇట్లు

పుల్లం పేట — ఎం. వెంకటస్వామినాయుడు,

11—5—24 — సబ్ రిజిష్ట్రార్.

---

శ్రీమతే రామానుజాయనమః

శ్రీమతే నిగమాంత మహాదేశికాయనమః॥

ఉ॥ వరకవితా వితానభవ, వాగ్విభవప్రతిభా ప్రభావమే దురులగు సత్కవీంద్రులకు, దోడ్పడు నాశుభవాణి వాణి సంభరిత కుతూహలాప్తి వెస, బారి మనోహ రలీల సుబ్బదా! సిరువుగనున్నచోట రసిమెంతయు పేట్క వరించె నీతసి॥

మ॥ పద లాలిత్యము నర్థగౌరవము జూ, పాంచాలి నంద
ర్భసం। పదబోధకుండగ జిక్కబట్టి సరణి, బాటించి
సచ్ఛైలి నొ।ప్పిదమౌ రీతి నమర్చ్చ సుబ్బకవి జెప్పెన్
దప్పు లేకుండ నూ।బది యార్వన్నె బసిండి చాయనె
గడెగా పద్య ప్రభావై ఖరుల్॥

క౦॥ ఎఱుగుదు నీతని మనుగడ।
నెఱుగుదు విద్యా ప్రచార, మెరుగుదు సుగుణం
బెఱుగుదు నింతటి వాడను।
నెఱు గోలుగ దెన్నడైన, నిప్పుడు గంటిన్॥

తే॥ గీ॥ నిర్మల జ్ఞాన వైరాగ్య, నిష్ఠ నెలమి।
భక్తిభావంబుతో నిండు, బాడ కొనియె।
నార్గ పద్ధతి సౌశీల్య, మనుకరించె।
గాన పఠనీయ్యమిదిః మోక్ష, కాముకులకు॥

శ్లో॥ వరరుచిరం నవరసవరం కరుణారస పూరితంచ మధు
రతరం। వరసుప్రకాశ శతకం రచిత మిదం సుబ్బదా
స వరకవినా॥

శ్లో॥ దత్వాయుశ్శ్రీర్యనో దార్ఢ్యమవ్యయం సుఖమంజ
సా। పాయాస్తామ్ సుబ్బదాసాఖ్య మిందిరా నంద
నందనా॥

ఇతి.

మాడభూషణం వెంకట నృసింహాచార్యః
అభినవ భారత శిఖామణి

23—8—23 బడకాయలపల్లె.

తే॥ గీ॥ సుప్రకాశశతక, సుపథ వాక్యంబుల।
తత్త్వ సారమెల్ల, దగ నిమిడ్చి।
భక్తి ముక్తి దారి, ప్రకటింప జేసెన।
సుబ్బదాస యోగి, సులభము గన॥

సీ॥ నాటకంబుల వ్రాసి, నవ్య నాట్యాలోక
నటనంబులకు నీతి, నాట గొల్పి।
పరగ నాయుర్వేద, ప్రకృతి స్నానౌషధ
పద్ధతిచే రుజల్, బాయ జేసి।
హరికథా నెపమున, నార్షేయ భావముల్
ప్రకటించి భక్తిని, వడుగొల్పి।
వేద వేదాంతార్థ, విషయంబు లెల్లను
సుప్రకాశము చేత, సొంది దెల్పి।

తే॥ గీ॥ ఇన్నివిధముల లోకుల, కింపు సొంపు।
నింప భరత మాతను, నేర్పు మీర
సేవ జేసెను భక్తుడీ, సుబ్బదాసు।
యోగ క్షేమంబు లొనగూర్చు, యోగి విభుడు॥

కం॥ లాలితపద వాక్ప్రతుకతి।
హేలాగతి తత్త్వశాస్త్రి, మెఱిగించుసుధీ।
శాలియగు సుబ్బ దాసులు
నోలి ప్రశంసార్హు లగుట, లోకమె యెరుగున్॥
కం॥ కే. కోటిరెడ్డి నాముడ।
శ్రీకర సొంపల్లె వాసి, చిరమిత్రుడన।

స్తోకమగు సుప్రకాశము।
వైకృత పద్యత్రియంబు బంపితి గొనుమా॥

సోమపాళ్యం.

---

క౦॥ శ్రీరామా హృత్పంకజ
సూరు డఃశంబు సకల శుభములనిడి తాఁ
గారుణ్యంబున సుగుణా
ధారుస [illegible] సుబ్బదాస సమాఖ్యా॥

ఉ. వింటిఁ ద్వదీయ క్రమనస, విశ్రుత విష్ణు కథల్ బు
ధేంద్ర నే।గంటి భవస్ప్రణీతఁగు, గంధమణీ శ
తిపద్య పూరితం। బుంటిని నిన్నుఁగూడి హిత ము
ష్పగఁ గొన్ని దినంబులార్య! నీ। వంటి యఖండ భ
క్తునను, భారత పుత్రుఁడుఁగల్గు నే ధరణ॥

సీ॥ దేశ దురాచార, నాశ సదుపదేశ
మొప్పు లొలెక్కెడిసనొ, కొక్కచోటఁ
వేదాంత సువిచార, విమలభావంబుల
నగ్గడించెదిసనొ, కొక్కచోట
బరమేశ సద్భక్తివఱలఁజేసెడి కీర్తి
నోత్కరములరెనొ, కొక్కచోట
బాక్రృత జన నాగ్ర,క భేదసూచన
లొగి వెల్గుచుండెనొ, కొక్కచోటఁ॥

గీ॥ నారా! నీ సుపత్రికాశ శ, తాఖ్య గ్రాలు
గ్రంథ రత్నంబు మన దేశ రక్షకంబు
పలుగనియ్యది ప్రజలకు భవ్యదంబు
గాంచ నాకెసె మి, మా? ఘన ముదంబు!

ఇట్లు

17—5—24 భవద్విధేయుడు.

రైల్వే, కోడూరు. వేదము, వెంకట కృష్ణశర్మ.

---

శా॥ రాష్ట్రీయము సుబ్బదాసు మహితారంభంబుగా
జేసె సం॥ తృప్తిం బొందగ సుపత్రికాశతకం, బిం
దుంచు తత్వంబుచే॥ కీర్తంబయ్యె కవిత్వ సార్థకత
యెం, తేలోక సంస్కారమున్॥ ప్రాప్తంబయ్యె నటం
చు నమ్మెదను సం, భావ్యంబులౌ నీతులన్॥

చ॥ పరమగు వస్తు వీకృతిని, వర్ణితమైనది యెల్ల వారికిన్॥
పరసవిధిం గనందగిన, సారము పొందు జనీయ నీతి
సుం॥ దరమగు మాతృభాషయ ప్ర, ధానముగాగ
గృహీతమౌర! యీ॥ నరుడు కృతార్థు డన్న వచ,నం
బున కెందు విఘాత ముండునే॥

ఇట్లు

కె. వి. నరసింహాచార్యులు
రాజనగరం, వనపర్తి సంస్థానం.
నైజామ్

---



ఓం తత్సత్

# సుప్రకాశశతకము

---

సీ॥ శ్రీకరుణారస◆ సింధువాత్సల్యైక
పూర్ణుండవైన నీ◆ పూజ్యయశము|
అణువణువాదిగా◆ నాబ్రహ్మ పర్యంత
మావరించిన నీదు◆ నమిత మహిమ|
నిఖిల జగజ్జాల◆ నిర్మాణమునఁ గదుఁ
బ్రకటితంబైన నీ◆ ప్రాభవంబు|
నిఖిల లోకంబుల◆ నిర్నిద్రశక్తిని
గనుసన్న నడుపు నీ◆ కౌశలంబు॥

తే॥ గీ॥ గాంచి యుప్పొంగి నీ తత్త్వ◆ మెంచిపొగడ|
భక్తితోలఁ కాడ మృదుల◆ భావములు పొదల|
శతక మర్పింతు గ్రహియింపు◆ హితమనీష|
సుగుణసంభావ్య సర్వేశ◆ సుప్రకాశ॥ 1

సీ॥ "ఓమ్నము" యనిపొత్తఁ నోర్మిదిద్దించిన
శేషాద్రి గురునకుఁ జేతులొగ్గి।
సంస్కృతాంధ్రములను శ్రద్ధమై నేర్పిన
నల్లప గురునకు నతులొనర్చి।
లక్షణ గ్రంథంబు లను నచ్చఁజెప్పిన
గుణనిధియగు సుబ్బ గురుని దలఁచి।
ఒనర నాయుర్వేద మును బోధ జేసిన
గొట్లూరు సుబ్బార్య గురుని నెంచి॥
గీ॥ మఱియు నద్వైతమును బోధ పఱచియోగ।
సరణి దెల్పిన గురుసింహ గురుని రామ।
దాస సిద్ధుల మది నెంచి వ్రాసినాఁడ
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 2

సీ॥ ఆది కవీశ్వరుం డైన వాల్మీకి శ్రీ
రామ వృత్తము వ్రాసి రహిఁ జెలంగె।
భవభూతి యుత్తర భాగంబు కరుణ చి
ప్పిల నాటకము వ్రాసి పేరు గాంచెఁ।
గవికుల శ్రేష్ఠుఁడౌ కాళి దాసుండు శా
కుంతలంబును వ్రాసి గురుతఁ బొందె।
నిపుడు రవీంద్రుడు నుపమాన రహితమౌ
గీతాంజలిని వ్రాసి కీర్తి కెక్కె।
గీ॥ నవుడు నిపుడును నీభక్తు లైన కవులు।
గలరు జగమునఁ దావక కరుణ వడసి।

ధన్యులైనట్టి సుజ్ఞాన ధనులు ఘనులు।
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ ౩

సీ॥ మాటి మాటికి భక్తి మాధుర్య ముప్పొంగి
వినువారి మునులుగా వింప వలయు।
అర్థమంతట వాక్కు లందూరి సభ్యుల
వీనుల విందుగా వింపవలయు।
భావ మింగితముచే బయట వచ్చొత్తి న
ట్లఖిల ప్రేక్ష్యులకు మది నంట వలయు।
రసము స్రవించి మా నసముఁ జాంచల్యంబు
నడఁచి బంధించి వేయంగ వలయు।
తే॥ గీ॥ నొక్క మాటిట్లు పాడి కథ నొక్క చెప్పు।
మరల వినవేల విని వేఁడు మాటలేల।
నాఁటి నుండియు నీ భక్తి నాటు కొనదె।
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ ౪

సీ॥ విద్య గల్గిన నేమి వినయము లేకున్న
ఫణిశీర్షమున మణి బరఁగునట్లు।
ధనము నుండిన నేమి దానంబు లేకున్న
కాటిలో పువ్వులు గలిగినట్లు।
చెలువ ముండిన నేమి శీలంబు లేకున్నఁ
బణ్యాంగనల రూపమున్నయట్లు।
శౌర్య ముండిన నేమి ధైర్యంబు లేకున్న
నేపికి నధికార మిచ్చినట్లు।

తే॥ గీ॥ మనుజుఁడై పుట్టినంత నే ♦ మాయె నెవ్వఁ|
లాతి వారికి నపకార ♦ లవము లేక|
నిశిత సుజ్ఞాని గానిచో ♦ పశువు గాఁడె|
సుగుణ సంభావ్య సర్వేశ ♦ సుప్రకాశ॥ 5

సీ॥ గ్రామ్యముఁ గైతలోఁ ♦ గలుపరాదనువారు
గలుపుటే యొప్పని ♦ పలుకువారు|
స్వస్వామ్య మడుగక ♦ సాధింతు మనువారు
నడిగియే సాధింతు ♦ మనెడు వారు
సంస్కారమున జాతి ♦ చక్కనౌ ననువారు
చెడు త్రోవఁ బడున ♦ చెప్పువారు|
వర్ణ భేదము లుండ ♦ వసతి లేదనువారు
సంకరంబగునని ♦ జడియువారు॥
తే॥ గీ॥ ఇన్ని పోటీలలోఁ బడి ♦ తన్ను గానఁగ
నిన్నిటను నీవు చేరియు ♦ నింద్రజాల|
విధ మొనర్చెద విది యేటి ♦ విధము తండ్రి|
సుగుణ సంభావ్య సర్వేశ ♦ సుప్రకాశ॥ 6

సీ॥ వ్యోము చుంబిత మహా ♦ ద్భుత హిమశైలమ్ము
భరియించు చున్న యీ ♦ భరత మాత|
నర్మదా గంగాది ♦ నదుల నెల్లప్పుడు
భరియించు చున్న యీ ♦ భరత మాత|
సకల సస్యౌఘముల్ ♦ ప్రకృతి సౌభాగ్యముల్
భరియించు చున్న యీ ♦ భరత మాత|

కనక రత్నములుండు♦ ఖని సమూహమ్ముల
భరియించుచున్నయా♦ భరత మాత|

తే॥ గీ॥ దేశములనెల్ల మిన్నగ♦ దేజరిల్లగ|
వఱలు చుండెను మున్నిప్డు♦ వాసిలేక|
దుర్భరస్థితి నున్నది♦దురిత దూర|
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 7

సీ॥ ధర్మ స్వరూపమా♦ ధరణీ తలంబున
బహుజన్మ పుణ్య సం♦ ప్రాప్తమైన|
మనుజ జన్మంబిసీ♦ మంచి జ్ఞానోదయం
బొందఁ జేసితివయ్య♦ యో మహాత్మ|
జ్ఞాన కర్మేంద్రియ♦ ఘనసూత్ర పరికర
సముదయంబునఁ బూర్ణ♦ సౌఖ్య మొసఁగి
పంచభూతంబుల భవ్య♦ మౌ సూర్యచం
ద్రాది బ్రహ్మాండ భ♦టాళిఁ గూర్చి॥

తే॥ గీ॥ న్యాయరీతిని నడువ నా♦ మ్నాయములను|
దాన మొసఁగిన నీకీర్తి♦ దలఁచి నిన్నుఁ|
గాంచి ధన్యతఁ బొందని♦ ఖలుని బ్రతుకు|
వ్యర్థమని బల్కుదురు బుధా♦ వళిజగాన
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 8

సీ॥ నిదుర లేచిన దాది♦ నిదుర బోయెడిదాఁక
భవజల నిధిలోన♦ బాధ పడుచు|

వ్యవహార చింతయు◆ వ్యాపారచింతయు
కూర గాయలచింత◆ కూటిచింత।
కొమ్మలపైఁ జింత◆ సొమ్ములపైఁ జింత
సుతులు లేరనుచింత◆ బ్రతుకుచింత।
ధనముపైఁ జింతయు◆ దాయాద చింతయు
పశువులపైచింత◆ పసిడి చింత।
తే॥ గీ॥ ఇన్ని చింతలలోఁబడి◆ తన్నుగొనుచు।
నదియె సుఖమని యెంచు నే◆ యధము డగుచు।
నిన్ను గానక చచ్చు నో◆ కన్నతండ్రి।
సుగుణ సంభావ్య సర్వేశ◆ సుప్రకాశ॥ 9

సీ॥ ఉపమాన రహితమీ◆ యుర్వి నొక్కని మోము
నీరేజముల మీఱు◆ నేత్ర యుగము।
పరికింప నొక్కని◆ పల్కు తేనియ లొల్కు
పలుచాలు కుట్మల◆ పఙ్క్తి గేరుఁ
గాంచనొక్కని నడ◆ కడురమ్యమై తోఁచుఁ
జూడ సంగమ్ములు◆ సొంపు మీఱు।
రమ్యమౌ యొకస యు◆ రంబుఁ గాంచిన యంత
కరచరణంబులు◆ ఘనత మీఱు॥
తే॥ గీ॥ నహహ నీ సృష్టి చిత్రము◆ నరసిజాక్ష।
నిట్టి దట్టిది యని యూహ◆ నెఱుఁగ లేను।
పొగడఁదరమౌనె నీ శక్తి◆ పూతచరిత।
సుగుణసంభావ్య సర్వేశ◆ సుప్రకాశ॥ 10

సీ॥ ఉదయ కాలము నందు ♦ నిదుర మేల్కొని వచ్చి
యొగి తల్లి దండ్రుల ♦ కొనర మ్రొక్కి
మ్రొక్కియు ష్ణోదక ♦ మ్ము నభక్తి నిండారఁ
దాన మాడించియుఁ ♦ దడిని నొత్తి
యొత్తి ధౌతంబులౌ ♦ మెత్తని వలువలు
మేనికి నిండుగ ♦ మెలఁగఁ గట్టి
కట్టియు రసపూర్తి ♦ నట్టి పదెడు దివ్య
షడ్రసోపేత భో ♦ జన మమర్చి
గీ॥ ఇచ్చి యలరంగ తాంబూల ♦ మిచ్చి యెకలఁ
రెసగ మేసగింగ పితృపూజ ♦ నెనయ చేయుఁ
టది యె సచ్ఛాస్త్ర మంతరో ♦ యమలకీర్తి
సుగుణ సంభావ్య సర్వేశ ♦ సుప్రకాశ॥ 11

సీ॥ తల్లి దండ్రులపూజఁ ♦ దనరఁ జేసియె కదా
పుండరీకుఁడు స్వర్గ ♦ పురము జేరె
తల్లి దండ్రి పూజఁ ♦ దనరఁ జేసియె కదా
చాల సుధన్వుఁడు దివ్య ♦ ఫలముఁ బొందె
తల్లి దండ్రుల పూజఁ ♦ దనరఁ జేసియె కదా
గురు పుత్రుఁడా బ్రహ్మ ♦ పురముఁ జేరె
తల్లి దండ్రుల పూజఁ ♦ దనరఁ జేసియె కదా
పరశురాముఁడు మహా ♦ భాగుఁడయ్యె
గీ॥ తల్లి దండ్రుల కెప్పుడు ♦ నుల్ల మలరఁ
బూజఁ జేసెడి వాడెపో ♦ పుత్రుఁడవని

తే॥ గీ॥ మనుజులై పుట్టినంతనే ◆ మానవు నెవ్వరైన|
లాతి వారికి నపకార ◆ లవము లేక|
నిశిత సుజ్ఞాని గానివా ◆ పశువు గాదె|
సుగుణ సంభావ్య సర్వేశ ◆ సుప్రకాశ॥ 5

సీ॥ గ్రామ్యముఁ గైతలోఁ ◆ గలుపరాదనువారు
గలుపుటే యొప్పని ◆ పలుకువారు|
స్వస్వామ్య మడుగక ◆ సాధింతు మనువారు
నడిగియే సాధింతు ◆ మనెడు వారు
సంస్కారమున జాతి ◆ చక్కనౌ ననువారు
చెడు తొలఁగింప బనులఁ ◆ జెప్పువారు|
వర్ణభేదము లుండ ◆ వసతి లేదనువారు
సాంకరంబగునని ◆ జడియువారు॥

తే॥ గీ॥ ఇన్ని పోటీలలోఁబడి ◆ తన్నుకొనఁగ
నన్నిటను నీవు చేరియు ◆ నిందప్రజాల|
విధ మొనర్చెద విదియేటి ◆ విధము తండ్రి|
సుగుణ సంభావ్య సర్వేశ ◆ సుప్రకాశ॥ 6

సీ॥ వ్యోమ చుంబిత మహో ◆ ద్భుత హిమశైలమ్ము
భరియించు చున్న యీ ◆ భరత మాత|
నర్మదా గంగాది ◆ నదుల నెల్లప్పుడు
భరియించు చున్న యీ ◆ భరత మాత|
సకల సస్యౌఘముల్ ◆ ప్రకృతి సౌభాగ్యముల్
భరియించు చున్న యీ ◆ భరత మాత|

కనక రత్నములుండు♦ ఖని సమూహమ్ముల
భరియించు చున్నయీ♦ భరత మాత।

తే॥ గీ॥ దేశములనెల్ల మిన్నగ♦ దేజరిలగ।
వెలుగు చుండెను మున్నిప్డు♦ వాసిలేక।
దుర్భరస్థితి నున్నది♦దురిత దూర।
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 7

సీ॥ ధర్మ స్వరూప మౌ♦ ధరణీ తలంబున
బహుజన్మ పుణ్యాళి♦ ప్రాప్తమైన।
మనుజ జన్మంబిడి♦ మంచి జ్ఞానోదయం
బొందఁ జేసితివయ్య♦ యో మహాత్మ।
జ్ఞాన కర్మేంద్రియ♦ ఘనసూక్ష్మ పరికర
సముదయంబునఁ బూర్ణ♦ సౌఖ్య మొసఁగి
పంచభూత బుల భవ్య♦ మా సూర్యచం
ద్రాది బ్రహ్మాండ భ♦టాళిఁ గూర్చి॥

తే॥ గీ॥ న్యాయ రీతిని నడువ నా♦ మ్నాయములను।
దాన మొసఁగిన నీకీర్తి♦ దలఁచి నిన్నుఁ।
గాంచి ధన్యతఁ బొందని♦ ఖలుని బ్రతుకు।
వ్యర్థమని బల్కుచుందురు బుధా♦ వళిజగాన
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 8

సీ॥ నిదుర లేచిన దాది♦ నిదుర బోయెడిదాఁక
భవజల నిధిలోన♦ బాధ పడుచు।

మోహా తురంగంబు♦ మురిసి పర్గిడుచుండ
చింతాగ్ని మిక్కిలి♦ చెలఁగుచుండ॥

గీ॥ ఏమి సుఖమని జనులింక♦ నాశించి|
మోక్షమార్గముఁ దలఁపక♦ మరగుచుందురు|
ఎందు విషయంబులను బొంద♦ నెంచుచుందురు|
-సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 16

సీ॥ కోటికిఁ గడియించు♦ కొన్న వరుఁడైన
గోచి నైనను వెంటఁ♦ గొనుచు బోఁడు|
అవనీ ధవుండైన♦ నంత్యకాలమునందు
నగ్నంబగు చితిఁ♦ బగ్గియగును|
అత్యంత నవమోహ♦ నాకారుఁడైనను
వృద్ధుఁడు కాకట్టి♦ వెలయలేఁడు|
వీరుల గెలిచెడు♦ వీర్యవంతుండైన
సర్వజ్ఞుఁడై తుద♦ నీల్గిచచ్చు|

గీ॥ లేశమేనియు నీదయ♦ లేక యున్న|
ఇట్టి వారైన శుభముల♦ నెలయ లేరు|
పుడమి నపగత నాముఁడై♦ పొల్పునయ్య|
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 17

సీ॥ ఆశాసమీరణ♦ మట్టట్టు గొట్టఁగ
దుఃఖఫేనంబొప్పు♦ తొట్ట గిలఁగ|
మోహాతరంగముల్♦ మోదుచు నుండఁగ

సుఖశీకరంబులు♦ చుట్టుకొనఁగ
సుడిఁబోలు భార్యయు♦ జుట్టి త్రిప్పుచునుండ
సుతనక్రములు బట్టి♦ వెతలఁబెట్ట
బంధుకూలీరముల్♦ బట్టి పీకుచు నుండ
సోదర మీనముల్♦ సుక్కఁజేయ
గీ॥ నకట సంసార సాగరం♦ బంతరింప
భావక ధ్యానమను దృఢ♦ తరణిగాక
యార్తునకు దిక్కు వేరెద్ది♦ యప్రమేయ
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 18
సీ॥ జన్మమెత్తినదాది♦ చచ్చెడు దాఁకను
నల కపోతముమాడ్కి♦ మెలగు వాఁడు
అసికంబు విషయాదు♦ లాశించి యగ్నిలోఁ
బడిన శలభమట్లు♦ జెడెడు వాఁడు
తనకున్న దానిలో♦ దానమొసంగక
భ్రమరంబు రీతిని♦ బరగు వాఁడు
లాతి సతులఁగోరి♦ కేతకీ గర్భస్థ
మత్పదంబుల భాతిఁ♦ జచ్చు వాఁడు
గీ॥ నీ కృపాపూర్ణ మనమను♦ నిలయమందు
చోటు గాంచక నీనామ♦ సుధనుఁ గ్రోల
వలను పడకయుఁ జెడును భూ♦ వలయమందు
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 19
సీ॥ నిర్మలోదక పూర్ణ♦ నిమ్నగా జలములు
దాహంబు నణఁపవే♦ తలఁచి చూడ

సుప్రియ నిందిత్రియవశుండ వు♦ సూరివంద్య!
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 23

సీ॥ సంసార మనుగొప్ప♦ సంద్రిమును దాటంగ
దావక ధ్యానము♦ తరణి గాదె!
కర్మపాశాత్మకమగు♦ కాననమును గాల్ప
నమల ప్రత్యగ్రూప♦ మగ్ని గాదె!
యజ్ఞానమను గొప్ప♦ యంధకారముం బాప
ప్రజ్ఞాన మే రవి♦ ప్రభయు గాదె!
తృష్ణా మహాసర్ప♦ తీవ్రవిషము వోవ
నణురూపుండే తార్క్ష్య♦ మణియుం గాదె!
గీ॥ పాప జలదౌఘముల్ దోల♦ భవ్యమైన!
భవ దుదార సమాఖ్యయే♦ పవనమయ్య!
ఆర్తులకు నీవె దిక్కయ్య♦ యప్రమేయ!
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 24

సీ॥ పగలు జంతువు లెల్లం♦ బనిచేసి యలసిన
నూఱడిల్లగ నిద్ర♦ నొసగినావు!
నిదురించు ప్రాణులం♦ గదిసి యాపద లేక
కాచుచు నెప్పుడు♦ బ్రోచినావు!
తొలి జాముననె వేగ♦ మెలంకువం గలిగింప
నొసంగితి కుక్కుట♦ విసర ములను
మాంద్యముం బోంగొట్ట♦ మలయ మారుతమిచ్చి
యొనరంగ స్థైర్యము♦ నొసంగి నావు!

గీ॥ శారి కాకీరపిక ♦ పాళి యారవముల।
నమిత సంతోష మొసఁగితి ♦ వయ్య నీవు।
నీదు మహిమము పొగడంగ ♦ నేరనయ్య।
సుగుణ సంభావ్య సర్వేశ ♦ సుప్రకాశ॥ 25

సీ॥ సద్వస్తు సందోహ ♦ సౌందర్యగరిమంబుఁ
నెలమిఁజూడఁగఁ గన్ను ♦ లిచ్చితయ్య।
అవ్యక్త వ్యక్తాక్షరంబు ♦ లైన యారావము
లింపుగ విన వీను ♦ లిచ్చితయ్య।
షడ్రసంబుల రుచుల్ ♦ చవిచూచి తెలియఁగ
నొనరఁగ రసనంబు ♦ నొసఁగితయ్య।
ప్రస్ఫుట శీతోష్ణ ♦ పద్ధతు లెఱుఁగంగ
నోజఁ త్వగింద్రియ ♦ ముంచితయ్య।
గీ॥ వాసనలఁజూడ నొసఁగితి ♦ నాసికయును।
పాప పుణ్య వివేచనా ♦ ప్రాప్తి నొసఁగ।
జ్ఞాన మిచ్చితి వయ్య వి♦జ్ఞాన గమ్య।
సుగుణ సంభావ్య సర్వేశ ♦ సుప్రకాశ॥ 26

సీ॥ చెలువైన యట్టి నీ ♦ సృష్టి విలాసంబు
చూడని కన్నులు ♦ వాడు దోసలు।
నిగమ సంస్తుత్యమౌ ♦ నీపేరు నుడువుటఁ
గ్రోలని రసనంబు ♦ గరగసంబు।
జ్ఞాన నేత్రంబునఁ ♦ గనక నీరూపంబు
పులక మొందని మేను ♦ బోదె గాని।

జగతీశుఁడగు నిన్ను ♦ సంస్మరింపుట యందు|
బరఁగని యాబుద్ధి ♦ పాడు బుద్ధి|
గీ॥ అఖిల లోకంబులను కుక్షి ♦ యందు దిమిడ్చి!
యొందు నంటక నన్నిటి ♦ యందు నిండి|
యలరు నీదగు మహిమను ♦ దెలియనట్టి|
యోగి జన్మము జన్మమే ♦ యోగివంద్య|
సుగుణసంభావ్య సర్వేశ ♦ సుప్రకాశ॥ 27

సీ॥ కసవు మెక్కుచుఁ గాన ♦ వసియించు మృగముల
కరుణఁబూనక చంపుఁ ♦ గఠినుఁ డొకఁడు|
ఫల భక్షణముఁ జేసి ♦ వఱెసు పక్షుల
నదయుఁడై కడతేర్చు ♦ నల్పుఁ డొకఁడు|
పుష్కరంపు ముఱికిఁ ♦ బోగొట్టు మీలను
వల వైచి చంపును ♦ తులువ యొకఁడు|
వరిగడ్డిఁదిని పయో ♦ వర్షంబుఁ గురియించి
జనులఁ బ్రోచెడు గోవుఁ ♦ జంపు నొకఁడు|
గీ॥ కటా కటా! వీరి హృదయముల్ ♦ కఠిన శిలలు|
జగతి నిట్టి దురాత్ములు ♦ చాఁ గలరు|
వీరి నెట్లు లడంచెదో ♦ వేద వేద్య!
సుగుణ సంభావ్య సర్వేశ ♦ సుప్రకాశ॥ 28

సీ॥ భార్య యుస్సురటంచుఁ ♦ బడి యేడ్చుచుండఁగ
వేశ్యా గృహముఁ జొచ్చి ♦ వెడలువాని|

జాతుల వధమౌన్వ చందముఁ దలఁపక
చేఁపల గుత్తలు చేయు వాని|
ఆఁడు బిడ్డలనమ్మ గోడు దలంపక
సంఘ సంస్కారణంబుఁ జాటు వాని
భారతీయులు చాల బాధ లందుచునుండఁ
గల్లు పాటలు బాడ వెళ్ళువాని|
గీ॥ నట్టి వీరల నొకఁ జంపఁ గొట్టి నంచి|
మార్గమును జూపి బుద్ధిని మాఱఁజేసి|
దేశభక్తులఁ జేయుమో దేవదేవ॥
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥

సీ॥ ఆత్మయే యష్టియు నాలోచనం బగ్ని|
ఇధ్మంబు దేహము హింస దమము|
వేది వక్షంబును వెండుర్క లాకుశ
లమరఁగ శిఖయును యజ్ఞభూమి|
ఆజ్యంబు కామమౌ నమిత కోపము పశు
వగు హృదయమున యూప మగు నటంచు|
నేను విధానంబు నప్పి శస్త్ర దక్షిణయును
బుత్విజులై యొప్ప నింద్రియములు|
గీ॥ ఆ పురోడాశమును యుష్మ దైక్య మగును|
అనుచు స్మృతి పలుకుచుండుట నరయ లేక|
హింస గావింత్రు సవమని హంసరూప|
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 30

సీ॥ ఫేణి లాడు జిలేబి♦ పిండి కుడుములును
పాల హోళిగ లాది♦ భక్ష్యతతియు।
కదురుచికరములో♦ కడప పిషాణంపు
యాదృచ్ఛికంపు శా♦ల్యన్న తతియు।
కందనంగలు పొట్ల♦ కాకర కాయలు
చాల రీతులు గల♦ శాకతతులు।
అనటి ఫలంబులు♦ నామ్ర ఫలంబులు
పనస ఫలములాది♦ పండ్లవితతి

గీ॥ ధరణి నుండఁగ వీనిని♦ నరులు విడిచి
మాంసమును మెక్కుచుందురు, హింసయనక
వారిజఠరము లెట్టివో♦ పరమ పురుష!
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ ౬౧

సీ॥ కూటికై బీదలు♦ కుయ్యిడుచుండఁగ
మూఁడు పూటలఁ దిని♦ మురియు టెట్లు।
వసియింప బీదకు♦ వసతి లేకుండఁగ
మేడలపై నుండి♦ మెలఁగు టెట్లు।
మఱుపుట్టమును లేక♦ నిరుపేద లుండఁగ
ఘనదుకూలంబు లను♦ గట్టు టెట్లు।
దుమ్ములోఁ దమ్ములు♦ దొరలుచు నుండఁగ
పట్టు మెత్తల మీఁదఁ♦ బండు టెట్లు॥

గీ॥ అకట! జగమందు బీదల♦ యార్తనాద!

ములు విన( బలుచునే రెండ(గ॥ మూఢరీతి।
చూడనేరను నీయుండ(॥ జోత్తునయ్య।
సుగుణ సంభావ్య సర్వేశ॥ సుప్రకాశ॥ 32

సీ॥ అగతికులకు నిండ్ల॥ యన్న మొసంగరు గాని
లవాని కిత్తురు॥ కాంచనంబు।
తలి దండ్రులకు సేవ(॥ దనర( జేయరు గాని
సాని స్త్రీ స్త్రీలకు పూజల సలుప(గలరు।
ఇలు పేదకు నొకింత॥ నేల నియ్యరు గాని
గృహ దాన మిత్తురు॥ గేహి కెలమి।
గోవాశనంబొందు॥ భావ మెంచరు గాని
ముద్దు బసవుగారచి॥ ప్రముఖ్యచంద్రు॥

గీ॥ ధరణి( దలపోయ రీ సూక్ష్మ॥ ధర్మములను
కుటిల వర్తను లజ్ఞాన॥ పటిమచేత।
వారు వొందరు నీదగు॥ భూరి కృపను।
సుగుణసంభావ్య సర్వేశ॥ సుప్రకాశ॥ 33

సీ॥ మానసమా నీకు॥ ధ్యానంబు చాలించి
కనులు విచ్చి జగంబు(॥ గాంచు మిట్లు
పొట్ట కూటికి రాలు॥ గొట్టి వీధిని దుమ్ము
గ్రిమ్మ మాసిన గుడ్డ(॥ గట్టె నతడు।
ఎండ వానల కోర్చి॥ కొండ కట్టెలు దెచ్చి
గంజిచే నొక పూట(॥ గడపె నితడు।

భూమిని దున్ని ప్రజకు♦ భోజ్య వస్తువు లిచ్చి
    యలసి యూరబలెఁ గ్రోలు♦ నకట యితఁడు।

గీ॥ ఇట్టుల గష్టించుచుండఁగ♦ నిట్టి జనులు
మా త్రకై దోసి లొగ్గము♦ ముందు వీరి।
యుద్యమముఁ దలఁగింప దేవుని♦ నడిగికొనుము
సుగుణసంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ ౩౪

సీ॥ స్వర్ణ కారక వస్త్ర♦ సర్వశిల్పజ్ఞులే
    దేశము వృద్ధికిఁ♦ దెచ్చువారు।
జనుల నెల్లెడలను♦ గనిపెట్టు వారలే
    దేశము వృద్ధికిఁ♦ దెచ్చువారు।
వైదిక నైతిక♦ ప్రజ్ఞా ధురీణులే
    దేశము వృద్ధికిఁ♦ దెచ్చువారు।
వ్యాపార నౌకా♦ వ్యాధి నిర్ణేతలే
    దేశము వృద్ధికిఁ♦ దెచ్చువారు॥

గీ॥ ఇట్టివారలఁ గోట్లకుఁ♦ బుట్టఁజేసి।
వారిచే దేశ మభివృద్ధిఁ♦ బడయఁజేసి।
యిద్ధ జనులకు శుభములు♦ నొసఁగుమయ్య।
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ ౩౫

సీ॥ ధర్మ శాస్త్రార్థమ్ములే♦ దల క్రిందుగా మారె
    గుణ కర్మరీతులు♦ గుహలఁ దూరె
ధనరత్న రాసులు♦ తఱిగి యావలఁ జేర

డాంభిక వేషముల్ దఱఁవు మీఁతె
ప్రౌఢా వివాహంపు పద్ధతులే జారె
విధవల దుఃఖంబు వెల్లిబారె
శమదమ క్షాంతులు సత్యశీలము లారె
నార్యుల సిద్ధాంత మలవి గోరె
౩ ఎన్నియో కష్టముల నీకు కన్న సుతులు
పొందుచున్నారు వారిని బోనడంచి
బ్రోవఁజాలుదు నీదయ యుంచి లోకవంద్య
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ 36

౪ పరఁగ నాయుర్వేద పద్ధతి గలియును
వస్తు తత్త్వార్థంబుఁ బడయ లేక
గజపుటంబులు దృతుల్ గాఁవిభస్మంబులు
చేయుచు రుజబోవఁ జేయలేరు
అరయ నీరమెమందు ధరణియె యొక మందు
సినుక దిబ్బలె మందు కసవు మందు
కొండనెత్తంబును నెండయె యొక మందు
మలయ మారుత మొక మంచిమందు
౫ జంతువుల రోగములఁ బాప జగము నందు
వలయు మందులు భవరోగ వైద్యుఁడైన
నీవు సులభముగా వీని నెఱి సృజించి
యిచ్చి తిరకౌషధములెల్ల నేటికయ్యె
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ 37

సీ॥ మునగ బచ్చలి గోంగుర గొబ్బిచెంచెల మెంతి
కూరలు సాగనాకులను దెచ్చి।
మిరపకాయలు నూనె జీవేప యింగువ
చింతపండుప్పును జేరదేసి।
యెల్లుల్లి కొబ్బర బెల్లము పదునుంచి
రాతి రుబ్బుఘ కిర్గవాత నుంచి
పిండమంచును యూరి బెండి యొక్కటి చేర్చి
పొట్ట బగుల దాని నట్టె మెక్కి
గీ॥ రోగ మేవేళ బెంచి యారోగ్య మొసఁగు
ప్రకృతిగానక పర్వెక ప్రతిభ నేర్చె
పాపి నన కొనటిది మా స్వభావమయ్య।
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ। 33

సీ॥ భారత జాతికి భావ దాస్యము మాన్ప
నే మహాత్ముఁడు జన్మ మిలను బొందె।
హిందూ మహమ్మదీ యీర్ష్యలు పోఁగొట్ట
నే మహాత్ముఁడు జన్మ మిలను బొందె।
బాన పిశాచంబు పాఱఁద్రోలుటకునై
ఏ మహాత్ముఁడు జన్మ మిలను బొందె।
సరఁగ నహింసాఖ్య పద్ధతులను దెల్ప
నే మహాత్ముఁడు జన్మ మిలను బొందె॥
గీ॥ నట్టి గాంధి మహర్షి యహీనకీర్తి
ప్రవిమలాధ్యాత్మఖని సత్య పాలకుండు

నీవు భక్తులలో మేటి॰ నిర్వికార।
సుగుణ సంభావ్య సర్వేశ॰ సుప్రకాశ॥ 39

సీ॥ క్రీస్తు మతంబె బల్॰ శ్రేష్ఠమంచనియెడి
కైస్తవ సోదరు॰ ఘనుఁడు గాఁ।
ఇస్లాము సుమతంబె॰ యెక్కుడంచని మొడు
వర మహమ్మదు జాతి॰ నరుఁడు గాని
శాక్తేయమతమె శ॰శాస్త్రీయ మనియెడు
శక్తి పూజను చేయు॰ జనుఁడు గాని
పరగ శైవ మతంబు॰ పరిశుద్ధమని దెల్పు
తనరెడివర లింగ॰ ధారిగాని॥

గీ॥ మాధ్వుఁడైనను మఱియు రా॰ మానుజీయు।
డైన నద్వైతియైనను॰ నాధ్యమైన।
శాంతి రసము బొందఁగ॰ జాలకున్న।
నిన్నుఁ గాంచుట సున్నయా॰ పన్నరక్ష।
సుగుణ సంభావ్య సర్వేశ॰ సుప్రకాశ॥ 40

సీ॥ ప్రజల బిడ్డల రీతి॰ రాణ నేలనివాఁడు
రాజు గాడతఁడు గో॰ రాజుగాని।
తలి దండ్రులకుఁ పూజ॰ దనరఁజేయని వాఁడు
కొడుకు గాడతఁడు దుం॰ దుడుకుగాని।
పతి యాజ్ఞలకు మాఱు॰ పలుకుచుండెడియాలు
యాలుగాదది చెడ్డ॰ తేలుగాని।
భార్యకు ద్రోహంబుఁ॰ బరఁగఁ జేసెడివాఁడు
భర్తగాఁడతఁడు సం॰ హర్తగాని॥

గీ॥ సన్ను భూత దయాళుని◆ పర్శికాను|
దలంచి యానంద జలధిలో◆ వెలదు నట్టి
మనుజుఁ డాతఁడు నిక్కపు◆ దనుజుడయ్యు|
సుగుణ సంభావ్య సర్వేశ◆ సుప్రకాశ॥ 41

సీ॥ ఎండ కన్నెఱుఁగని◆ యింతులఁ జెఱనుంచి
నరకుఁడే సౌఖ్య ని◆కరము బొందె|
నన్నల రాజ్యంబుఁ◆ నాక్రమించిన ద్రోహి
యాల సుయోధనుఁడేమి◆ ఫలము బొందె|
గర్వించి నాయంటి◆ ఘనుఁడు లేఁడనియెడి
శిశుపుడు నెంతటి◆ కాలముండెఁ|
బరుల శ్రేయస్సును◆ నోర్వని కట్టడి
బల శిశుపాలుఁడే◆ ఫలముఁ నొందె॥

గీ॥ గాన దుర్బుద్ధు లనుమాని◆ మానధనుఁడు|
"ఆత్మ వత్సర్వ భూతాని"◆ యనెడు నీతిఁ|
దెలసి సౌఖ్యము నొందును, దివ్యచంద|
సుగుణ సంభావ్య సర్వేశ◆ సుప్రకాశ॥ 42

సీ॥ రామచంద్రునిఁ గన్న◆ రమణి కౌసల్య యే
భారత మాతకుఁ◆ బట్టు గొమ్మ|
అభిమన్యుఁ గన్నయా◆ యతివ సుభద్రయే
ధారణీసతి కంఠ◆ హారమణి|
భరతునిఁ గన్నయా◆ ప్రమద శకుంతల
భూదేవి కింపగు◆ భూషణంబు|

అర్జుని గన్నయా ◆ యంగన కుంతియే
మేదిని సొమ్ములఁ ◆ మేలుబంతి।
ఇట్టి సాధ్వీమ తల్లులఁ ◆ బుట్టఁజేసి।
హైందవావని కీర్తిని ◆ బొందజేయ।
వయ్య! సజ్జన సన్నుతి ◆ యమల చరిత।
సుగుణ సంభావ్యసర్వేశ ◆ సుప్రకాశ॥ 43

ఘోరాటవులఁ దన్నుఁ ◆ గోరు బోయనిఁగాంచి
దమయంతి యేసీతిఁ ◆ దగ వచించె।
రక్కసి మూఁకచేఁ ◆ రక్షిత యగుసీత
దశకంఠు కేనీతి ◆ విశద పఱచె।
కీచకు మోహాగ్ని ◆ కీలలు చల్లార్ప
ద్రౌపది యేనీతి ◆ దగ వచించె।
పేరాశచేఁ దన్నుఁ ◆ జేరఁగోరు నహుషు
కేరీతి శచి నీతి ◆ నెఱుఁగఁ బల్కె।
గీ॥ ఇట్టినీతి విహారిణుల్ ◆ పుట్టఁగాదె।
భరత ఖండంబు ఘనకీర్తి ◆ వడసి నీతి।
నన్య ఖండంబులకుఁ బంపి ◆ మాన్య మగుట।
సుగుణ సంభావ్య సర్వేశ ◆ సుప్రకాశ॥ 44

సీ॥ తలవంచి పతిసేవఁ ◆ దనరఁజేయని యాలు
యాలు గాదది వెల ◆ యాలుగాని।
పరుసంపు మాటలఁ ◆ బలుకుచుండెడి భార్య
భార్య గాదది దుష్ట ◆ చర్యగాని।

సుఖదుఃఖముల రెంటి♦ జూడకుండిన దార
వార్ధగాదది మహా♦ క్రూరగాని|
అతిథి సంతర్పణ♦ మాచరించని జాతు
జాయ గాదది గొప్ప♦ దాయగాని||

గీ|| ఇంటఁగాలూన కెప్పుడుఁ♦ నిగుడు పొరుఁగు|
టిండ్లు దిరుగుచు పతిమాట♦ నెదను దలఁప
కుండు నా నారినినుఁగాంచ♦ నోపదయ్యా
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ|| 45

సీ|| నిక్కపు లేడీల♦ వెక్కరించిన రీతి
పక్క పాపటలతో♦ నిక్కు వారు|
పసపు కుంకుమ లేల!♦ పనికి రావని వీడి
ఫేసు పౌడరుఁ బూసి♦ వెలయువారు|
చలువ బట్టలకంటె♦ జాకెట్లు గౌనులు
మేలని ధరియించి♦ మెలఁగు వారు|
సీకాయి పొడుమేల♦ చెలువు పోవు నటంచు
బూషిద సబ్బులఁ♦ బూయు వారు

గీ|| చేతి గుడ్డలు ల్యావండరు♦ సెంటుబుడ్లు|
వాడు కొనువారు ధనమునుః♦ పాడుచేసి|
స్వీయ జనులకు ద్రోహము♦ జేయువారు|
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ|| 46

సీ|| క్షేత్రము లెల్లను♦ సేవింపఁబోనేల
సాగర స్నానంబు♦ సలుపనేల|

నెట్టన వైరాగ్యముల్ ♦ గట్టించుటది యేల
చాంద్రాయణంబును ♦ సలుపనేల।
కఠినోపవాసముల్ ♦ గావించు టది యేల
యూరక ద్రవ్యము ♦ నొసఁగనేల।
కాషాయ వస్త్రముల్ ♦ గట్టి తిరుగఁగనేల
సంసారమును వీడి ♦ చనఁగనేల॥

గీ। ఇంద్రియమ్ముల నిర్జించి ♦ యొలమితోడ।
జ్ఞాన మయుఁడైన నినుఁగాంచి ♦ శరణటంచు।
సాక్షి మాత్రుఁడు గానంట ♦ చాలదేమి।
సుగుణ సంభావ్య సర్వేశ ♦ సుప్రకాశ॥ 47

సీ॥ ఇంద్రియో న్మాదంబు ♦ నెడఁజేసి నినుఁగాంచి
పరగెడి దినమది ♦ పర్వదినము।
మూసి తొమ్మిది రంధ్ర♦ముల నంత నినుఁగాంచి
రాజిల్లు దినమది ♦ రామ నవమి।
పంచ కోశంబులఁ ♦ బరిమార్చి చిత్ప్రభఁ
గాంచిన దినమె యు ♦ గాది దినము।
విషయాదులను వీడి ♦ వెస మనంబును నిల్పు
దినమె యేకాదశి ♦ యను దినంబు।

గీ॥ నిట్టి దట్టిది యనిబుద్ధి ♦ నెఱుఁగరాని।
మోక్షపద మందు దినమది ♦ ముఖ్య దినము।
మిగులు దినమది దుర్దిన మగును దండ్రి।
సుగుణ సంభావ్య సర్వేశ ♦ సుప్రకాశ॥ 48

సీ॥ దగచేత నాలుక♦ తడియార వేగమె
వారి కై పరుగిడు♦ వానిఁబోలె।
దావాగ్నిలోఁ బడి♦ దరి గనుంగొనలేక
నలు వైపులను బాఱు♦ నరుని బోలె।
బలు భీతి నెదఁగొల్పు♦ పులినోటఁ బడఁగఁదా
మిత్రుని కొఱకేడ్చు♦ మృగయుఁబోలె।
త్రాఁచు బాము గరువ♦ దల కెక్క విషమెల్ల
మాంత్రికుఁ డెందను♦ మనుజుఁ బోలె।

గీ॥ ఆర్తిఁగొని నిన్నుఁ గననెంచి♦ యుగ్గలంపు।
జపముతో జన్మకర్మర♦ జ్జువులఁ జెండి।
నీదు చెంతను తాఁజేరు♦నో దయాళు।
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 49

సీ॥ వెఱ్ఱివాఁడని జనుల్♦ వెక్కిరింతురుగాక
జడుఁడంచు దూషింపఁ♦బడునుగాక।
మతిహీనుఁడని తండ్రి♦ మాటలాడును గాక
భార్య యుపేక్షచేఁ బలుకుఁగాక।
కుచ్ఛితుండని బావ♦ కూఁకరించును గాక
చెల్లెలధముఁడని♦ చెప్పుఁగాక।
దుష్టాత్ముఁడని సఖుల్♦ దొలఁగిపోదురుగాక
తమ్ముఁడు గర్విగఁ♦ దలఁచుఁగాక॥
గీ॥ అందఱన్ని విధంబుల♦ ననుచునుండ
నీదుభక్తుఁడు వానిని♦ నమ్మి నోర్చు।

కరము యత్నించి తుదనినుఁ గాంచనయ్య।
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 50

సీ॥ ఎవరి ప్రాపక మొంచి యెలమి నాపాండవుల్
కష్టముల్ తృటిలోన గడపి నారు।
ఎవరిఁ దిక్కు దలంచి యెలమి త్రిశంకుని
తనయుండు రాజ్యము ధారవోసె।
ఎవరి యండఁ దలంచి యెలమి శ్రీరాముఁడు
వారిధి సేతువుఁ బరగఁ గట్టె।
ఎవరి సహాయంబు నెంచి సుత్రాముఁడు
ఘోర వృత్రాసురుఁ గూల నేసె।

గీ॥ వారలందఱు నీభక్త వరులు గాన।
పరమ ప్రీతిని శుభపరం పరలనిచ్చి।
దివ్యకీర్తిని నిల్పితో దేవదేవ।
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 51

సీ॥ భక్తుల పాలించు భక్త వత్సలుఁడీవు
నగములలో మేరు నగమ వీవు।
తారకా సమితిలోఁ దనరు చంద్రుఁడ వీవు
అష్ట వసువులలోన నగ్ని వీవు।
వేదంబులందున వేదార్థమవు నీవు
రాజులలో రామ రాజ వీవు।
నీతులలో దండ నీతివి నీ వల
విద్యలలో మోక్ష విద్య నీవు॥

గీ॥ జంగమా జంగమాత్మక ◆ జగతియందు
తమరు లేరను చోటొకిం ◆ తయును లేదు
లేదు లేదన్న వారికి ◆ లేవు లేవు
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 52

సీ॥ కరుణాంతరంగుఁడు ◆ గరుణాళుఁడై యుష్మ
త్కృపాలవ ◆ మొందెనేని
నిర్ధనుండైనను ◆ నగణ్య ధనంబుచే
యుష్మత్కృపాలవ ◆ మొందెనేని
బలహీనుఁడును దివ్య ◆ బాహుబలాఢ్యుఁడౌ
యుష్మత్కృపాలవ ◆ మొందెనేని
భిక్షుకుండైనను ◆ బృథ్వీశతిలకుఁడౌ
యుష్మత్కృపాలవ ◆ మొందెనేని
గీ॥ అహహ నీ కరుణ మించిన ◆ యట్టి విభవ
మరయ నేలోకమున నెందు ◆ దొరకదయ్య
నీకు సామ్యంబు నీవెపో ◆ నిర్మలాత్మ
సుగుణ సంభావ్య సర్వేశ ◆ సుప్రకాశ॥ 53

సీ॥ ఏమి నీ యద్భుత ◆ శ్రీమహత్వము దీని
వర్ణింప నెవ్వని ◆ వశము తండ్రి
యొక్క తెప్ప పాటున ◆ సకల లోకములందుఁ
బుట్టి ప్రాణులు, కన్ను ◆ గిట్టుచుండు
నొక నిమేషములోన ◆ నున్నచరిత్రాళికిఁ
కష్టముల్ సుఖములు ◆ గడచుచుండు

నొక మహాూర్తమునందు నొగి దరిద్రుఁడుధని
ధనికుఁడు బీదయై దనరుచుండు

గీ॥ అహహా! యిమ్మాడ్కి చిత్రము లహరహంబు
చేయుచుండిన వచ్చు నాదాయ మేమి
నీకుఁ దగునయ్య? యీయాట నిర్వికార
సుగుణ సంభావ్యసర్వేశ సుప్రకాశ। 54

సీ॥ గుత్తమై నిగనిగల్ గుల్కు రేకులగూర్చి
ప్రతి సూచుకము లేక నతికినావు
వింతలే చాయల పెతలి నెయ్యము లాడ
నునుజాళు వాసగ్గు నునిచినావు
ఆమధ్య మృదుకేస రాళి సరాళింప
నాధారమును లేక నాటినావు
ముద్దు లొల్కెడు దిమ్మె మిద్దెయొక్కటి నుంచి
పూస లందంమున పూడ్చినావు

గీ॥ అహహా! పూవుసకు తూండ్లు నడుగున అలమి
కొనగ
అర్కునకు చందమామకు నలరముకువఁ
యబ్జ నిర్మాణ మెటుజేసి తయ్యజెపుమ
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ। 55

సీ॥ ఆకాశ మద్భుతమైన గుడారంబు
నలరు రంగస్థాన మిలయఁదెల్ల

తెరల్లు మాయామయం బరికర నికరంబు
సూత్ర వైచిత్ర్యంబు పాత్రనిచయము
గట్టి మేళవు గాంధర్వ కామాది మట్కాంబు
మించు దీపంబులౌ మిహిర విధులు
వైచిత్ర్యమౌ కథా వైదగ్ధ్య మీ సృష్టి
యజ్ఞానమను రాత్రి యాపు వేళ
గీ॥ గాటమైనట్టి యీ జగన్నాటకమును
నడుపుచున్నావు సూత్రధారుండవు వోలె
నహహా! నవరస వైచిత్ర్య మహిమ మెప్ప
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 56

సీ॥ ఉన్నతా హార్మ్యము లుద్యాన వనములు
జల పూర్ణ నదులును పులినచయము
జలజలమని పాఱు సెలయేటి నినదముల్
శుకపిక మాధురీ సుస్వరములు
చిత్రనిష్కుటములు చిగురు జొంపంబులు
పౌర్ణిమా రాత్రులు పద్మవనులు
మలయ మారుతములు జలద బృందంబులు
గజిబిజి యనెడి మనోజ వితతులు
గీ॥ చూచు చుండియు నంతటం జూపుమఱచి
కనుల నానంద బాష్పముల్ గ్రాలుచుండ
నిన్నుఁ గనుచుందు మజ్ఞాని తన్ను మఱచి
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 57

సీ॥ బహు జన్మ సుకృతంపు • భాగ్యవశంబున
జ్ఞాన సందృష్టిని • జగము కనిన
బ్రహ్మసాగరమునఁ • బరగు నీయఖిలమా
లోకముల్ బుగ్గలఁ • బోలఁదోఁచు
పదవులు రెల్లునై • యన్ని ఖండంబులు
వజ్రాంబులై యొగి • వలరు భూధ
ప్రాణులబ్ధియందుఁ • బరఁగు జలచరముల్
శశి సూర్యులును నుడు • వమితి మాలు

గీ॥ చూడి చూచియుఁ జూడ్కులఁ • జూడ మఱచి
తన్ను మఱచియుఁ దోఁచిన • వన్ని మఱచి
క్షీరమున నీరమంబలెఁ • జేరునయ్య
సగుణ సంభావ్య సర్వేశ • సుప్రకాశ॥ 38

సీ॥ క్రమ్ము మేఘంబులు • గర్జించు నప్పుడు
ఘోరమై వర్షంబు • కురియు నపుడు
పవమానము • విసరి కొట్టిన యప్డు
మించు దీవలు మింట • మెఱసి నపుడు
మెండుగ నెండలు • మీరగాంచిన యప్డు
శారద చంద్రికల్ • చల్లునపుడు
చల్లని తెమ్మెర • సరవి వీచిన యప్డు
పత్తుల్లిరంపులు గుల్కు • బల్కునపుడు

గీ॥ నీదు మహిమంబుఁ దిలకించి • నిచ్చనలరి
కనుల నానంద బాష్పముల్ • గారుచుండ

బోగడుచుండును సుజ్ఞాని॰ నిగమవంద్య
సుగుణ సంభావ్య సర్వేశ॰ సుప్రకాశ॥ 59

సీ॥ అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుఁడవౌ
నీ స్వరూపం బెన్న॰ నేను దగను
ఆకసంబు శిరమ్ము॰ బాలసూర్య చంద్రులు
నేత్రద్వయంబుగా॰ నిలిచి యుండ
దిక్కులు బాహువుల్॰ పొక్కిలి భూమియుఁ
బాతాళ లోకమే॰ పాదయుగము
తరువులు రోమముల్॰ గిరులు నెమ్ములుగాను
నిశ్వాస మనిలమై॰ నెగడుచుండ

గీ॥ పం॥ నలరుఁ జుక్కలు పుష్పహా॰ రాళి గాఁగ
కుంతలంబులు మబ్బులు॰ గుములు గాఁగ
వేదబృందము నీవాక్య॰ వితతిగాఁగ
బరఁగు నీరూపు ప్రాజ్ఞుఁడే॰ యెఱుఁగునయ్య
సుగుణ సంభావ్య సర్వేశ॰ సుప్రకాశ॥ 60

సీ॥ ఆప్యాయముగజల్ది॰ యంబలి ద్రావియు
సంకటి చిక్కము॰ చంక జేర్చి
మూపుపై గొంగడి॰ ముస్తీబుగా వేసి
నాలమందల తోడ॰ నడవికేగి
మరల నోగిరంబు॰ మనసార దిని వెన్న
మధురాంబువుల గ్రోలి॰ మందగూర్చి

నెల్లగిలారఁ జముల్ నెమకులు వేయుగ
కొండ నెత్తము జేరి నిండు ప్రేమ॥

గీ॥ ధరణి; పిల్లన గ్రోవిని స్స్వనము లొల్క
సృష్టి చిత్రము గాంచుచు సౌఖ్యయుండు
గొల్లడే. భూమి పతి మేటి కల్ల గాదు
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥

సీ॥ ముద్దుల శ్వానగూర్పు మురిపెముచే బాలు
రాట లాడెడివిధం బరసి నపుడు
మృగ శాబకంబులు మెక్కి తృణంబులఁ
బరుగులెత్తెడి చంద మరసి నపుడు
పక్షుల గుంపు ప్రభాత వేళలయందు
మించి పల్కుట నాలకించి నపుడు
పచ్చి కసవు మేయఁ బరువడిఁ బాలూర
నంబా! యనుచు ధేను వఱచు నపుడు

గీ॥ ఎవఁడు నీ సృష్టి చిత్రంబు లెంచి పొంగి
కనుల నానంద బాష్పముల్ గార్చి మెచ్చి
నిన్నుఁ బొగడక యుండును నిర్వికార
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 62

సీ॥ పరదేశమున కేగి పతియింటి కేతేర
సాధ్వి ప్రియునిఁ జూచు సంబరమున
పొదుగునఁ బాలూరఁ గదియు దూడకుఁ ద్రాపి

మేను నాకేడి గోవు◆ మెప్పునందు
ఎఱుఁదెచ్చి ముక్కుపచ్చ◆ లెండని పిట్టల
కిచ్చెడు పక్షులు◆ మమతయందు
పాల కేర్పడి చిన్ని◆ పాపకుఁజన్నిచ్చి
మోదముఁజూపెడి మాత◆ ముద్దులందు

గీ॥ నీదు కరుణా విధంబును◆ గొదువ లేక
జ్ఞాని గనుచుండు నీకృత్యము◆ జ్ఞాన గమ్య
గర్వదగ్ధులు చూడంగ◆ గలరె తండ్రి
సుగుణ సంభావ్య సర్వేశ◆ సుప్రకాశ॥ 63

సీ॥ భువన జాలము లెల్ల◆ బొంగరంబులరీతిఁ
దిప్పెడు నీదివ్య◆ తేజమునను
నక్షత్రరాసుల◆ నానాగ్రహంబుల
గనుసన్న నడుపునీ◆ కౌశలమును
అఖిల లోకంబుల◆ ననంతరాళము నందు
స్థిరముగ నిల్పునీ◆ చెయ్దిమునకు
చిత్రచిత్రముగాను◆ సృజియించి జీవుల
కాహార మొసఁగెడు◆ నమిత కృపకు

గీ॥ నలరి యెవ్వాఁడు నినుఁ గాంచ◆ దలఁప మదిని
నాశఁ బొందడు వాఁడెపో◆ యమితపాపి
వాని జన్మంబు వమ్మగు◆ వసుధ యందు
సుగుణ సంభావ్య సర్వేశ◆ సుప్రకాశ॥ 64

సీ॥ నీ ప్రభ సూర్యుచే నిఖిల జగంబుల
సూక్ష్మాంశువుల నెల్లఁ జూపినావు
నీ శాంత మహిమంబు నిండు చంద్రునిచేత
సకల లోకమ్ములఁ జాటినావు
నీ కృపారసమును నాకసంబున నుండి
యమృత వర్షముగాఁగ వనిచినావు
వఱలు గంభీర భావమునకు దీటుగ
జలధుల నాదంబు నిలిపినావు॥

గీ॥ నీదు కల్యాణ నిలయమీ నిఖిల భువన
జాలమగునందు చిత్రముల్ చాలనుంట
వానిఁగనుఁగొని యానంద వార్ధిఁ దేలి
సన్నుతింతురు భక్తులు కన్నతండ్రి
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 65

సీ॥ పగలు రాత్రులయందు జగమును వెలిఁగించు
సూర్య చంద్రుల నింటఁ జూపినావు
ఆఁకలి దప్పుల యానాట మును మాన్ప
ఫల జలంబుల భువి నిలిపినావు
ఇహ పరంబుల రెంట నెనలేని యానంద
మొందఁ శ్రుతి స్మృతుల లొసఁగినావు
సుఖ దుఃఖములరుచి చూపి ప్రాణిచయంబు
జగతి నశ్వరమంచుఁ జాటినావు

గీ॥ చం॥ అన్నిటను నుండి బ్రహ్మాండ మందుఁ బూర్తి
నొంది గుణక సాక్షివై యొక్కరీతి
సర్వమును బ్రేమమెయిఁజూచి సమత వెలయు
నిన్ను నెంతని గొనియాడ నేర్చువాఁడ
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 66

సీ॥ యుష్మత్ప్రతాపంబు గ్రీష్మభానుడు చాటు
శాంత గుణంబు నా శశియె చాటు
నీ దయారసమును నిండు వాఁకలు చాటు
గాంభీర్యమునుఁజాటు గడలి తాఁడు
నీ చిద్విలాస విధా నిఖిల సృష్టియె చాటు
నౌదార్య గుణమునా యవని చాటు
శాశ్వత సహానంబుఁ సర్వంసహాయె చాటు
నిర్వికార గుణంబు నింగిచాటు

గీ॥ నీదు మహిమను జాటు నా నిగమ గణము
నీదు నేర్పును జాటు నీ నిఖిల జగము
సర్వమును నీదు గుణముల జాటునయ్య
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 67

సీ॥ రాతి తోడను గూడి రత్నముండిన యట్లు
పూలలో గంధంబు పుట్టునట్లు
చంద్ర బింబము నందుఁ జంద్రిక యున్నట్లు
చెట్టులోపలఁ జేవ పుట్టునట్లు
తార హారంబున దారముండిన యట్లు

శీతోష్ణ ములఁ ♦ జిన్మాత్రమై యుండు
డని పవనంబున ♦ ననిచినావు
అన్నిటి లోనుండి ♦ యంట కుండెడు రీతి
భిన్న సాక్ష్యము గాఁగ ♦ బన్నినావు
మాలిన్య మంటక ♦ మనుజు లిల్లుండగ
నెంచి వచ్చిన్నని స్పృశి ♦ యుంచి నావు

గీ॥ ఇంత కృపఁజూపు చున్నట ♦ నెంచలేక
తల్లి దండ్రియు గురుఁడంచుఁ ♦ దలఁప లేక
మఱచితిని నిన్ను నన్ను నే ♦ మాఱకుమయ్య
సుగుణ సంభావ్య సర్వేశ ♦ సుప్రకాశ॥ 70

సీ॥ ఘోర సంసృత్యకూ ♦ పారముఁ దరియింపఁ
బల మొసఁగుము భూరి ♦ బల సముద్ర
తుచ్ఛ విషయములఁ ♦ దొలఁగియుండుటకుఁగాను
సన్మార్గమును జూపు ♦ సచ్చరిత్ర
సుఖ దుఃఖములు సోక ♦ సుఖపడుటకు
శాంతి మొసఁగుము ♦ శాంతిరూప
బీద సాదలకును ♦ పెన్నిధలం బ్రోయు
మతి నొసంగు మనం! ♦ క్షితితలేశ॥

గీ॥ శమము దమమును ధైర్యంబు ♦ సత్యవాక్కు
నా కొసంగుము ప్రాచీన ♦ నాథ నాథ
నీవె నాకేడుగడవయ్య ♦ నిర్మలాత్మ
సుగుణ సంభావ్య సర్వేశ ♦ సుప్రకాశ॥

సీ॥ కలిత చిత్తుఁడఁ గానఁ ◆ గరుణించి వరదయా
దృష్టిఁ జిలుకరింపు ◆ వేదవేద్య
మనమున జీకటి ◆ సంశయంబునుం బాపి
స్వచ్ఛ కాంతిని నిమ్ము ◆ సౌమ్యమూర్తి
పాప దైన్యము చేతఁ ◆ బరుగిడు చిత్తంబు
బట్టి శిక్షింపుము ◆ పాపహార
జీవిత కళడస్సి ◆ చీకాకు పడియెదు
నమృత సిద్ధి నొసంగు ◆ మప్రమేయ
గీ॥ విశ్వమున సంసార భీకర ◆ విపిన మాయఁ
జిక్కి వెలిగొంది నట్టి ◆ నాచెంతఁ జేరి
తాపకార్థ మా జ్ఞానసం ◆ ధానమిమ్ము
మగుణ సంభావ్య సర్వేశ ◆ సుప్రకాశ॥ 72

సీ॥ వెనుక నే నెత్తిన ◆ వేలు లక్షల కోట్ల
జన్మముల్ చెప్పంగఁ ◆ జాలు నెవఁడు
మునుపు నేఁ గుడిచిన ◆ చనుబాలు లెక్కింప
జల సముద్రము లెన్ని ◆ యగునో దలఁప
వసుధ రేణువు లెల్లఁ ◆ బ్రస్తరింపఁగవచ్చు
తల్లిదండ్రుల సంఖ్య ◆ తలఁప నగునె
మాటె నీ జగమును ◆ మాఱెరి రాజులు
నాదు జన్మము మాఱఁ ◆ లేదు తండ్రి
తే॥ ఏలఁ కృప లేదె పెఱవానిఁ ◆ బోలె దలఁప
నీకు నిది పాడి యగునె ◆ నిర్నిద్ర లాప్త

వేగ నీయఁడఁ జెప్పుము వేద వేద్య
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ! 73

సీ॥ సృష్టి సౌభాగ్యంపు శ్రేష్ఠత్వముఁ జూప
బాపించితివి నన్నుఁ బరమ కృపను
గాంచితి నీసృష్టి కౌశలంబును దాఁక
జూడ నాకెంతయుఁ జోద్యమయ్యె
నీవు పంపినపని నెఱవేర్తి నన్నిక
నీదరిఁ జేర్పుము నిర్మలాత్మ
వంత కూటప్రపంచ మెంతయుఁ జేసితి
తీర్చెనా పని నీకుఁ దెలుపు కొనఁగ
గీ॥ నాజ్ఞ యిచ్చిన వచ్చెద నయ్య నీదు
దివ్య దర్శన సంప్రాప్తి దినము కొఱకు
వేచి యున్నాఁడఁ బిల్పు వేగఁ దండ్రి
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ! 74

సీ॥ ఎత్తితి జన్మము లెన్నియో లక్షలు
చూచితిఁ బలు మాఱు సుర పురంబు
గర్భ దరిద్రుఁడై గను ధనవంతుఁడై
మూఢుఁడనై పండితుఁడనై మాల నైతి
చిలువనై చిలుకనై తలఁప నెనుబది నాల్గు
లక్షల జాతులలోన లలి జనించి
అమిత కష్ట సుఖము లనుభవించితిని సూరి
జనులకుఁ బూజలు సలిపి నాఁడ

గీ॥ జాలిఁ నాజన్మమో రెయలఁ♦ జాలునయ్య
ఏల్ల యుటు చేసెదవునన్ను♦ నేలుమయ్య
ఏలకుండిన నిన్విడేఁ♦ జాలనయ్య
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 75

సీ॥ ప్రకృతి శాస్త్రజ్ఞు చేతఁ♦ బ్రాసించి జోసును
వల్మీక భవ్యకవి♦ వర్యుఁజేసి
అభిమన్యునకు శౌర్య♦ మధికంబుగా నిచ్చి
రామ కృష్ణుని మడి♦ రహిఁజలరంగి
సాందీపునకు జ్ఞాన♦ సామ్రాజ్యము నొసగి
పాతంజలికి యోగ♦ పథముఁ జూపి
త్యాగరాజును గాన♦ ధౌరేయునిఁగ నుంచి
ప్రహ్లాదునకుఁ జాల♦ భక్తి దేర్చి

గీ॥ అయ్యో! నను వ్యర్థునిఁగఁ జేసి♦ యాకసమ్మునఁ
దిరుగు శరదభ్రశకలపుఁ♦ గరణి నుంచి
యున్న వాఁడవు కరుణింపు♦ మో మహాత్మ
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 76

సీ॥ రాచకార్యపు దక్షి♦ రాజ్య భారపు శక్తి
బాల గంగాధర♦ తిలకు కిచ్చి
అసమ వాక్పటిమంబు♦ నమల ధీమహిమంబు
శ్రీవివేకానంద♦ సిద్ధున కిడి
పర హితాచరణంబు♦ పరమహో కరుణయుఁ

బరఁగ బుద్ధుని మది♦ గురియుఁ జేసి
సంస్కరణపు భక్తి♦ సాధనాంతరయుక్తి
వీరేశ లింగార్యు♦ విభుని కొసఁగి
గీ॥ శ్రీశ! నాకోర్కె గ్రీష్మస♦ రిజ్జలంబు
వలెను నింకఁగఁ జేసితి♦ వరుస యేల
నన్ను విడనాడ ధర్మమా♦ కన్న తండ్రి
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 77

సీ॥ ఎన్ని యుగంబులో♦ నన్ను దూరముఁ జేసి
విడనాడ నీవు నే♦ విడువ నయ్య
ఏటికి నెదు రేగు♦ దీటుగ దుఃఖంబు
బోనాడి వచ్చితి♦ బ్రోవవయ్య
హృదయ నీరేజ బు♦ నెండుచున్నది కానఁ
గరుణా రసము చిల్క♦ కావవయ్య
మృత్యు సర్పము మెల్ల♦ మ్రింగుచున్నది నన్ను
నీలోనఁ జేర్చియు♦ నేలు మయ్య
గీ॥ అంధకారపు గర్తంబు♦ నందుఁ జిక్కి
కాయమును డస్సె దివ్యమౌ♦ కాంతి నొసఁగి
నన్ను రక్షింప వయ్య యా♦పన్నరక్ష
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 78

సీ॥ వెలి కనులను వీడి♦ వేవేగ నీచెంతఁ
జేర వతును గాని♦ యూరకుండ

బనిలేని యప్పుడు♦ నినుఁ గాంచుటకు దాకి
గోరు చుందును గాని♦ యూరకుండ
బ్రతి దివసంబు నీ♦ పనిటూని నినుఁజూచు
చుందునుగాని నే♦ నూరకుండ
పాన్పుపై బడి నిన్నుఁ♦ బల వరించుచు నెప్పు
డుందును గాని నే♦ నూరకుండ

గీ॥ పం॥ నామ యాత్రినిఁ గుందెదు♦ నట్టివేళ
గాని యెప్పుడు నినుఁగొల్వ♦ కేను భోజ
నంబు నైనను జేయను♦ నాదుబంధ
నంబులను ద్రెంచు టెప్పుడు♦ నాథనాథ
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 79

సీ॥ దిన దినంబును మోహ♦మను పాశములఁ ద్రెంపి
నీ సమత్వము నను♦ నిలుప వయ్యా
నిచటి కార్యము లెల్ల♦ నెలమిమైఁ జేసితి
నీ సన్నిధిని నన్ను♦ నిలుపవయ్యా
జనసంఘమును బాసి♦ మునిమైన వేళలో
నీ యెదుటను నన్ను♦ నిలుపవయ్యా
అంత్య కాలపు దుఃఖ♦ మనుభవింపక ముందు
నీ మూంగిలను నన్ను♦ నిలుపవయ్యా

గీ॥ ఎట్టి సమయంబు నందు నిం♦ కెట్టి దేశ
మైన నిలచిన గూర్చున్న♦ ననఘ చరిత

త్వన్మహా దివ్య తేజంపు♦ దారిఁ జేర్చు
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 80

సీ॥ సురభి నాటక సభా♦ గుర్తుండ నన్ని దేశంబు
దిరుగుట నీయాజ్ఞ♦ తెలియఁ గాదె
హరిశ్చంద్ర కథలను జేసి♦ ధర్మోపదేశ సభలందుఁ
జెప్పుట నీయాజ్ఞ♦ చేతఁగాదె
భైక్షవృత్తిచే♦ వసుధ బీదల సేవఁ
జేయుట నీయాజ్ఞ♦ చేతఁగాదె
అఖిల తత్త్వంబులు♦ నరయుచు గురుల సేవ
జేయుట నీయాజ్ఞ♦ చేతఁగాదె

గీ॥ అట్టి నీయాజ్ఞ నిజమ్మ♦ పొందుఁగాక
పూర్వ భవమున నెంతయో♦ పర్వహించి
వచ్చితిని జెంతఁజేర్చు కృ♦పామయాత్మ
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥

సీ॥ క్షమచేతనే గదా!♦ యమిత రాజ్యము వదలి
పాండవుల్ విరటుని♦ పాలనుంట
క్షమ చేతనే గదా!♦ సత్య హరిశ్చంద్రు
డల మాలనికి మేను♦ నమ్ము కొనుట
క్షమ చేతనే కదా!♦ సజ్జనుండగు శిబి
త్యాగాన మాంసమ్ము♦ డేగ కిడుట
క్షమ చేతనే కదా?♦ విమలా పగాసుతుం
డాజన్మ బ్రహ్మచ♦ ర్యంబు గొనుట

గీ॥ క్షమకుసరి పోలు వేఱొస్సౌ ఖ్యంబు గలదె
అమితమౌ క్షమ గలిగిన యాత్మవిదుఁడు
నీదు భక్తాగ్రగణ్యుఁడౌ నెగడునయ్య
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 82

సీ॥ మానసంబు నిలిచె మూర్ఛ మబ్బునటన్న
నంతలోఁ జలియించి యరుగునెగదు
మరలఁ దెచ్చిలయించు మార్గముఁ జూపిన
మోహనంబుచే నన్నుఁ బాసి వెడలు
కుంభకంబునఁ గట్టి క్రూల్చి వైచినయంత
దెగఁదీసి పర్విడుఁ దెంపు చేత
దివ్య తేజముఁ జూపి తెరువు బంధించిన
పరవశమైలేచి పాటి పోవు

గీ॥ గాన విషువును పట్టును లేనిదివ్య
రాజయోగంబుచే శ్రద్ధ రాజిలంగ
నభ్యసింపక నినుఁగాంచ నగునె తండ్రి
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 83

సీ॥ వరుస నిత్యానిత్య వస్తు వివేకమి
హాముత్రభోగ నిష్కామితయును
మహితమైనట్టి శమాదిషట్కంబును
క్షయ మొందనిము ముముక్షుకత యనఁగ
నీ సాధనంబుల నెప్పుడు దప్పక
యాచరించుచు నుండు నతఁడు వేగ

గురు సన్నిధికి భక్తి నరిగి యాత్మానాత్మ
మును విచారించెదు ఘనుడుగాని

గీ॥ తావక ధ్యాన నిర్మల తత్త్వదృష్టి
బడసి నిను గాంచి ధన్యతఁ బడయునయ్యా
చపలుఁడెఱుగునె సెప్పు ప్రాచీన పురుష
సుగుణ సంభావ్య సర్వేశ సుపశ్రీకాశ॥

సీ॥ చర్చింప జననాది షడ్వికారములచే
నుడివడు దేహంబు స్థూలమండ్రు
పదియు నేడింద్రియ ప్రాపక మైలింగ
దేహంబు సూక్ష్మమౌ దేహమండ్రు
అజ్ఞాన మీరెంటి కాధారమై యాత్మ
నైక్య మందిన కారణాఖ్యఁదనరు
మూడవస్థలచేత ముడివడు చుండు నీ
మూఁడు దేహంబుల జూడ నెఱిఁగి

గీ॥ ఏది వెలుఁగొందు శుద్ధమై యేకరీతి
నట్టి చిన్మాత్రుఁడైన నిన్ననిశ మీశ
దెలియుటే మోక్ష మందురో దేవదేవ
సుగుణ సంభావ్య సర్వేశ సుపశ్రీకాశ॥ 85

సీ॥ ఉర్వి శోణిత శుక్ల యుక్త్యుద్భవంబయి
యన్నకోశమగు నాహారమునను
పంచ ప్రాణులు కర్మ పంచేంద్రియంబుల

కూడికయును ప్రాణ కోశమంద్రు
జ్ఞానేంద్రియము లైదు ఘన మనం బొక్కటి
కూడి మనోమయ కోశమంద్రు
ఎంచ బుద్ధియు జ్ఞాన పంచేంద్రియంబివి
జ్ఞాన కోశంబని జ్ఞాను లంద్రు
అరయ నంతఃకరణానంద మోద ప్రి
యాజ్ఞాన కోశము లనఁగ నైదు
గీ॥ కోశముల నెల్లకాలము గోరి యరసి
యెఱుఁగి యవస్థలఁ జూచుచు నొక్కరీతి
సాక్షిగానుంట ప్రత్యక్ష మోక్షమంద్రు
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 86

సీ॥ షట్చక్ర రీతులఁ జర్చించి తనలోన
పంచ ముద్రల భావ మెంచి దెలిసి
తారక సిద్ధుఁడై తలఁపు శుద్ధము చేసి
సాంఖ్య శాస్త్రార్థంబు చక్క నెఱిఁగి
వర పతంజలి సూత్ర పద్ధతులను నేర్చి
దండకాన్వయ రీతిఁ దగ నెఱింగి
యజపగాయత్రీ రహస్యంబు తెలిసియు
లంబికా యోగ సం లక్ష్య మెఱిఁగి
గీ॥ చేసిచేయని చేయక చేయుచున్న
దివ్య నమనస్క సిద్ధుఁడై తేజరిల్లి
జ్ఞాని నీసత్య రూపులోఁ గలయునయ్య
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 87

సీ॥ ఆ స్థితిలో బ్రహ్మ◆ మరసి యుంట్రియ మదరా
బవనముంచుట యమం◆ బనఁగఁ బరగు
తన శవ్యమై తోఁచు◆ దాని స్పృశింపక
నెగడుటయే యిల◆ నియమ మొందు
విశ్వంబు చిత్తంబు◆ వెస నెఱింగి యుపేక్ష
వహియించుటే త్యాగ◆ మహిమ యండ్రు
మనసు వాక్కులకును◆ గనరాని యోగంబు
మౌన విధి విధాన◆ మార్గ మండ్రు॥
గీ॥ ఇట్టి కడు సూక్ష్మ యోగంబు◆ లెట్టు గుఱుని
దయ నెఱింగి భవాంబుధి◆ దాటి తాను
నిత్య సుఖమందు సుజ్ఞాని◆ నిహమునందు
సుగుణ సంభావ్య సర్వేశ◆ సుప్రకాశ॥ ౮౮

సీ॥ స్వాంత మన్య పదార్థ◆ సమితి బ్రహ్మంబని
యెఱుఁగ ప్రాణాయామ◆ పరణియుండు
శివమయ మాత్మఁగఁ జూచి◆ వెసమనంబును బుద్ధి
నెనయఁ బ్రత్యాహార◆ మనఁగఁ బరఁగు
సందేహించూచిన◆ నాదు బ్రహ్మంబుగాం
చుట ధారణయను◆ పేరిటఁ జలంగు
ఏను బ్రహ్మంబని◆ యెఱిఁగి సద్వృత్తిని
మొనసియుండుట ధ్యాన◆మనఁగఁ బరఁగు
గీ॥ నిటి గుహ్యార్థ సూక్ష్మంబు◆ లెఱుఁగు యోగి
వీని నన్నియు వస్థల◆ వేగ నడిపి

కర్మ జేసియు చేయఁడు◆ నిర్మలాత్మ
సుగుణ సంభావ్య సర్వేశ◆ సుప్రకాశ॥ 89

సీ॥ ఆద్యంతములు లేని◆యట్టి నిండిన వస్తు
వరయ విజనమని◆ యనుచు నుంద్రు
ఎందు గృతకృత్యులై◆ యుందురో విబుధులు
నది ప్రసిద్ధాసనం◆బనఁగ బరఁగు
ఏ స్థలంబునఁ జిత్త◆మేక రీతిగనుండు
నదియె గదా మూల◆మనఁగఁ బరఁగు
ఏదృష్టిచే జగం◆బెల్ల బ్రహ్మము దోఁచు
నవ రాజయోగంబి◆టందురు బుధులు

గీ॥ ఇట్టి స్థిరుఁడైన యోగంపుఁ◆జెట్టఁబట్టి
నీట మునిఁగిన భాండంపు◆ సాటిగాను
యోగి చరియించుచుండును◆ యోగివంద్య
సుగుణ సంభావ్య సర్వేశ◆ సుప్రకాశ॥ 90

సీ॥ పడవలోఁ గూర్చుండి◆ పయనంబుఁ జేసిన
బయటి వెల్ల నడుచు◆ పగిదిఁ దోఁచు
శారద చంద్రికా◆ సమతి గాంచిన పైన్య
గదునకు బంగరు◆ కరణి దోఁచు
కొఱవి గిఱ్ఱునఁ ద్రిప్ప◆ కొలఁదిని వట్రువై
సూర్య మండలగతి◆ సొబగు తోఁచు
కంటి కద్దములిడ◆ కాంచిన సూక్ష్మ వ
వస్తువెల్ల గొప్పగఁ◆ దోఁచు చుండు

గీ॥ నటులె యజ్ఞాన వశమున♦ నాత్మ నఱచి
తను వటించును మూఢుండు♦ దలఁచు దాను
వ్యక్తి గుండని గన లేక♦ సత్యరూప
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 91

సీ॥ ఒనర దేహంబును♦ నొక్క రథంబుగఁ జేసి
కరణంబులను దురంగములఁ జేసి
మించు చిత్తంబును♦ మేలుకళ్ళెముఁ జేసి
బుద్ధిని సారథిఁ బోలెఁ జేసి
యీ యహంకారంబు♦ నిరుసునుగాఁ జేసి
విశ్వాసములు చక్ర♦ విధిగఁ జేసి
చటుల సుషుమ్నను♦ చబుకునుగాఁ జేసి
రథికుఁడై లోపల♦ నాణనుండి

గీ॥ రాజ యోగంపు నడి వీధి♦ రథము విడచి
ధూర్తమైనట్టి సంసార♦ గర్తమందుఁ
బడక నిన్నుఁ గాంచు యోగియు♦ పరమ పురుష
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 92

సీ॥ హాయిగ గంధవా♦ హమ్ము వీచెడివేళ
ప్రజ పరవశముగ♦ పగది గాను
కొక్కొరు మబ్బులు♦ మ్రోగుచుండిన కేకి
పురి విచ్చి యాడెడి♦ కరణిగాను
లేమావి చిగురుల♦ లెక్క మీఱఁగ మెక్కి

పాడెడి కోకిలం వసువుగాను
వేణు గాన రసంబు వీనుల సోకిన
బరవశించు గోవు సరణిగాను

సీ॥ అమల సుజ్ఞాని విన్నగాండి యనవరతము
సచ్చిదానంద సంపూర్ణ నీరరాశి
దేలి జగమును మఱచునో దివ్యరూప
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 93

సీ॥ తమమి విషయంబులం నంటరాదని గదా
సూర్య రశ్మిని సాక్షి జూపినావు
సుఖ దుఃఖముల రెంటి జూడ నశ్వరమని
శుభ గ్రహ సాక్షిగఁ జూపినావు
కవి హృదయము చాల గంభీర మనిగదా
యుదధిని సాక్షిగ నుంచినావు
మాని లక్ష్యంబున మానరాదని కదా
సాక్షిగ గుఱికానిఁ జాటినావు

గీ। నీవు సృష్టిని నీవస్తు నిచయములను
జనులు ధర్మంబులను నేర్చు కొనుటకవని
దేశికుల రీతిఁజేసితే దేవ దేవ
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 94

సీ॥ చర్చింప నాటక శాలదేహముఁ జేసి
హృదయ రంగస్థాన మేర్పఱించి

వృత్తి బుద్ధుల నాట పెద్ద నటులఁజేసి
పరఁగు సంకల్పంబు తెరన జేసి
దివ్యరు కూటస్థుని దీపముఁగా జేసి
కామాదులను మేళ గాండ్రజేసి
పంచేంద్రియములఁ జూచు వారిగఁజేసి
కథ దేవి మహిమము గాఁగఁజేసి
గీ॥ స్వప్నమందాటఁ జూపుచు సక్రమముగ
సూత్ర ధారుఁడవై సాక్షి మాత్రుఁడుగను
నాట లాడింతు వాడవ అఖిలరూప
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 95

సీ॥ అఖిల బ్రహ్మాండము నావరించిన నీకు
గుడి గట్టు నంతటి వెడఁగెవాఁడు
"నామ రూపక్రియల్" నహియని యుండ నీకె
విగ్రహంబుగ నెంచు వెఱ్ఱి యెవఁడు
గుణ ధర్మి ధర్మంబుఁ గూడకుండి నిన్ను
గుణియంచుఁ బొగడెడి కుమతి యెవఁడు
నిగమంబులఁజివర నిలచియుండెడి నీకు
నుత్సవంబులఁ జేయు నోగెవండు
గీ॥ నీమహాదివ్య తేజంబు నెగడుచుండ
నాఁటు నీభక్తుఁడగు పార్థు నకు నొసంగి
నట్టి, జ్ఞాననేత్రంబును నలర నిచ్చి
వీరి దుర్బుద్ధి బాపుము పరమపురుష
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ 96

॥ పగటి రేయిని గుంచెం బట్టక చిత్రముల్
గాలిల వ్రాసెడి చిత్ర కారుఁడెవ్వఁడు
బలు రంగులఁ బరగు పలు పుష్పవితతులను
మహా సృజించిన చోట మాలి యెవఁడు
నిర్జనా టవులందు నీటి పట్టులనుంచి
దాహ బాధను దీర్చు దాత యెవడు
అజగరంబు నోటి కన్న మొసఁగుచు
పాలించు చున్నట్టి ప్రభుఁడెవండు

గీ॥ నాదు హృత్తంత్రులకు హృదు నాదమొదవ
సొంపు మీఱంగ మ్రోఁగించు సుభగుఁ డెవఁడు
అట్టి ప్రభు చిత్ప్రకాశంబు నాశ్రయింతు
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ 97

సీ॥ సొంపుగ మది పరిశుద్ధిగాంచితినయ్య
యెప్పుడిందు వసియింప నీవు
తలఁపున సత్కృతముల్ తోలఁగఁ దోసితినయ్య
యెప్పుడిందు నె వసియింప నీవు
దుర్గర్వమును మదిఁ దున్ని వేసితినయ్య
యెప్పుడిందు నె వసియింప నీవు
విషయ వల్లుల నెల్ల విరచి వైచితి నయ్య
యెప్పుడిందు నె వసియింప నీవు

గీ॥ బుద్ధి దీపంబు వెలిఁగించి మొనసినాను
చిత్తమను పాన్పు నీకును సిద్ధమయ్యె

విశ్రమింపుము నాతండ్రి విశ్రమింపు
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ ౯౮

సీ॥ అజ్ఞాన తిమిరంబు నణంచినే నీకునా
మతిగేహమందు స్వాగత మొసంగి
శ్రీవిమల ధ్యానార్ఘ్య పాద్యములను నిచ్చి
యాయాస మంతయు నపన యించి
వైరాగ్య దీపంబు వర్ధిల వెల్గించి
భక్తియు శ్రద్ధము పరిబల్క జేసి
పూని యహింసాది పుష్పములను గూర్చి
పూనిక్తి మీఱుచు నుండఁ బూజఁ సల్పి

గీ॥ పూని యుపరతి దర్భ తాంబూల మొసఁగి
సాంజలిని జేసి జ్ఞానాక్షి నంత తెఱచి
ప్రాకృతుల నోసరుద్నైక్య సంప్రాప్తి కోఱు
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ॥ ౯౯

సీ॥ ఎట్టికాలంబైన నేవేళలందైన
యింటనైనను వీధి వెంటనైన
గ్రామాంతరంబైన ఘన విపినంబైన
నీటనైనను మాఱు నేటనైన
ఆటపాటల నైన అధిక వ్యాధులనైన
మాటలాడుచునైన మౌనమైన
నిర్వికల్ప సమాధి నిష్ఠలయందైన
సవికల్పక సమాధి సమయమైన

గీ॥ అమల సుజ్ఞాని స్థూలదే♦హంబు విడిచి
భావనాతీతకైవల్య♦పదముఁ జేరి
నీటిలో నుప్పు కరఁగిన♦ దీటుగాను
చెదరకుండును నీవేళ♦ జగదధిష్ఠ
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 100

సీ॥ ఈ జగం బొకదిన♦ మెంచఁగ బ్రళయాన
శంధి నడుమ వలెఁ♦ గఱఁగిపోవు
ఈ భానుఁ డొక దిన♦ మెంచ తేజంబింక
చక్రబులబులెఁ గ్రింద♦ జాఱి పడును
ఈ వహ్ని నొక దిన♦ మెంచఁ వేడిమిమీఁడి
చప్పున జ్వాలలు♦ చల్లఁ బడును
ఈ గాలి యొక దిన♦ మెంచఁ గతిని వీడి
యాకాశ నిలయమం♦ దైక్యమగును
గీ॥ కాని జ్ఞానాగ్నిచే మేనిఁ♦ గాల్చి వైచి
నిన్నుఁ గలసిన యాభక్తుఁ♦ డెన్నియుగము
లైన నిలకడగా నుండు♦ ధ్యానగమ్య
సుగుణ సంభావ్య సర్వేశ♦ సుప్రకాశ॥ 101

సీ॥ ఏ వికారము లేక♦ యెందుఁ దానంటక
తాఁజేయు పనులందుఁ♦ దగులుకొనక
తైల ధారనఁబోలి♦ దఱుగక యొకరీతి
"ససి" పదంబునఁ జేరి♦ యాత్మ విదుఁడు
నిలచినఁ గూర్చున్న♦ నలరఁబల్కుచు నున్న

పనుల్లను జేసినఁ ◆ బాడియున్న
సేసాధనములేక ◆ యేమియుఁ దలఁపక
శుద్ధుఁడై సంపూర్ణ ◆ సిద్ధుఁడగుచు

గీ॥ సమలసుజ్ఞానికానిట్టు ◆ లమరియుండి
యూహలకు మాటలకు నంది ◆ యుండ నట్టి
యమృతపద మొంది సుఖయించు ◆ నఖిల రూప
సుగుణ సంభావ్య సర్వేశ, సుప్రకాశ॥ 102

సీ॥ అందమై మిగుల నా ◆ నంద కరంబునై
వంద్యమై మోక్ష సం ◆ బంధ మగుచు
దివ్యమై జ్ఞాన సం ◆ భావ్యమై మానిజన
సేవ్యమై సజ్జన ◆ స్తవ్యమగుచు
సారమై బుధజనా ◆ ధారమై చిరచిదా
కారమై సంసార ◆ దూరమగుచు
నిత్యమై బ్రహ్మాండ ◆ కృత్యమై యోగీంద్ర
నృత్యమై యాధార ◆ సత్య మగుచు

గీ॥ పలుకులకు నూహలకుఁ గాని ◆ తెలియ బడక
నిష్కలంక విధంబునై ◆ నిర్వికార
మైన నీరూపుఁ జూతు మో ◆ యుప్రమేయ
సుగుణ సంభావ్య సర్వేశ ◆ సుప్రకాశ॥ 103

సీ॥ షడ్రసంబుల రుచిఁ ◆ జవిజూచు నాల్కకు
నరయ తైలంబించు ◆ కఁటనట్లు

సీటఁ బద్మదళంబు॥ నిలిచియుండియు దాని
తడియించు కేనియు॥ దగలనట్లు
బురదలోఁ గుమ్మర॥ పురుగు పాటాడచు
పంకిలంబును మేను॥బడయ నట్లు
కలుగుంచ లోన నా॥కసము నిండియు దాని
కావంత మైలయు॥ నంటనట్లు
గీ॥ అమల సుజ్ఞాని సంసార॥ముందె యుండి
కర్మములఁ జేసి చేయని॥ కరణినుండి
యెందునంటక నీ ధ్యాన॥ముందె నిల్చు
సుగుణ సంభావ్య సర్వేశ॥ సుప్రకాశ॥ 104

సీ॥ పొదువు నిండుగ పాలు॥ పొదలుచు నుండియు
పిదుదు గోలును దూడ॥ వశువుగాను
పూల సన్నిధి పేడ॥ పుర్వుండినను దాని
మధువు ద్రావును తేఁటి॥ విధముగాను
నారికేళఫలమ్ము॥ నాశ్రయించిన కోతి
దినును లో జిగురును॥ మనుజు రీతి
శిరశిందు చంద్రికా॥ పరచితి యందుఁదు
నెఱుఁగునే మంచి కన్నెఁజేగి బెట్లు
గీ॥ శుద్ధ చిన్మాత్రమా నిన్ను॥ శుభదమైన
సురచిరానంద సమనస్క॥ పరచితుండు
నెఱుఁగునే గాని! యితరులు॥ నెఱుఁగు టెట్లు
సుగుణ సంభావ్య సర్వేశ॥ సుప్రకాశ॥ 106

సీ॥ ప్రాచీన విజ్ఞాన ♦ పద్ధతులను నేర్చి
శిల్ప శాస్త్రజ్ఞులు ♦ చెలఁగుచుండ
సకల సస్యాఢ్యమై ♦ సంపదాకరమునై
భారత మాతయుఁ ♦ బరఁగుచుండ
ప్రజలు రాజులు భేద ♦ భావంబుఁ ను వీడి
యన్యోన్య మైత్రిచే ♦ నలరుచుండ
క్షామాది బాధలు ♦ గాఁగకుండఁగ జనుల్
నిత్య సంతుష్టులై ♦ నెగడుచుండ
గీ॥ ధైర్యమును కార్య శూరత ♦ ధర్మ దృష్టి
గలిగి సత్యంబు వీడక ♦ కలిత భక్తి
మిమ్ముఁ బూజించు భాగ్యము ♦ నిమ్ము తండ్రి
సుగుణ సంభావ్య సర్వేశ ♦ సుప్రకాశ॥

సీ॥ తేనె సోనల జిలుకు ♦ తియ్యతీ కావ్యంబు
విరచింప తిక్కన ♦ ప్రెగడ గాను
పూలచెండ్ల గజల్లు ♦ లీల పద్యంబుల
రచియింప పోతన ♦ రాజు గాను
ముద్దు పల్కుల గను ♦ ల్మాతలెత్తినరీతి
పల్కంగ ముక్కు తి ♦ మ్మన్న గాను
స్వాదు ద్రాక్షార్గసా ♦ స్వాదన మైనట్లు
నడువంగ పెద్దనా ♦ ర్యుడను గాను
గీ॥ ఆవ్యాప్తరస కవీశ్వర వరా ♦ వలగ జెప్ప
ఆంధ్రవాణ్మికి సుబ్బరా ♦ యుండ గాను

శక్తిహీనుఁడఁ గైకొమ్ము శక్తరూప
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ।

సీ॥ నిగమంబులే నిన్నుఁ బొగడఁజాలక యున్న
నేనెట్లు కొనియాడఁ గేర్తునయ్య
బల్లు మాటలు కొన్ని జత గూర్చి చేసిన
శతసంఖ్యపై నష్ట సంఖ్యగలుగు
పద్యపుష్పాంజలి భక్తిమై నర్పింతు
పరిశుద్ధ మతిఁ గొమ్ము భవ్యచరిత
దయయుంచి భక్తబృందములోన కడపటి
వానిగా ననుఁజూడు దీన నాథ

గీ॥ తలఁపనను ధర్మవరసుబ్బదాసటండ్రు
చెలితలైనంతమాత్రము చేసియున్న
సీస శతకము వర్ధిల్ల జేయవయ్య
సుగుణసంభావ్య సర్వేశ సుప్రకాశ।
శాన్తి, శాన్తి, శాన్తిః 108

సంపూర్ణము.





ఈ గ్రంథము కావలయువారలు

మ॥ రా॥ గోరంట్ల వెంకటసుబ్బయ్యశ్రేష్ఠి

గారివద్దగాని లేక

గ్రంథకర్త వద్దగాని దొరకును

ధర్మవరము

అనంతపురం జిల్లా

Priented at the Pinakini Press, Anantapur.

